అచలప్రబోధరత్న నిత్యానంద

# శ్రీ వాడపల్లి ఆనందం రాజయోగి గారి

# జ్ఞాపిక



శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య

వరంగల్ జిల్లా.



కుటుంబ సభ్యులతో శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు



శ్రీ ఆనంద ఆశ్రమము - రామంచ



శ్రీ వాడపల్లి ఆనందార్యులవారి శిష్యబృందం-రామంచ



2001లో అచలప్రబోధరత్న బిరుదుతో సన్మానిస్తున్న
డా॥ దయానంద స్వామి దంపతులు



శ్రీ పరమానంద సామ వెంకన్న గారు



శ్రీ పూర్ణానంద
గుడిబోయిన బిక్షం గారు



శ్రీ రాజన్న గారు



శ్రీ కె.క్రిష్ణారెడ్డి గారు



శ్రీ పిల్లి లక్ష్మీనారాయణ గారు

# శ్రీ వాడపల్లి ఆనందార్యులవారి శిష్యబృందం



శ్రీ తులా సుదర్శన్ సువర్ణ దంపతులు



శ్రీ మంకు రత్నాకర్ - జయప్రద దంపతులు



శ్రీ అంపోజ్వాల తిరుపతి, అరుంధతి దంపతులు



శ్రీ తులా శ్రీనివాస్ సాంబలక్ష్మి దంపతులు



శ్రీమతి సిరికొండ సుభద్ర గారు



శ్రీ మారాటి చంద్రయ్య గారు
చిన్నముప్పారం



శ్రీమతి అంబటి సత్యమ్మ గారు

ఓం

శ్రీగురుభ్యోనమః

అచలప్రబోధరత్నా నిత్యానంద

# శ్రీవాడపల్లి ఆనందార్య రాజయోగి

# జ్ఞాపిక

తేది 25-2-2013 సోమవారము రోజున

మండలారాధన సంధర్భముగా

సంపాదకుడు

యదార్థబోధోపదేశిక డా॥ కూన దయానంద స్వామి

శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య

16-10-224, శ్రీభక్తానంద ఆశ్రమము.

శివనగర్, వరంగల్

# శ్రీ శివరామదీక్షితసిద్ధాంత సాంప్రదాయ గురుపరంపర



శ్రీశివరామదీక్షితులు



శ్రీమత్కంబారూరి అప్పబ్రహ్మం



శ్రీపరుశురామసీతారామస్వామి



శ్రీమద్భాగవత కృష్ణదేశికులు



శ్రీమత్ పీల్కాణ లక్ష్మణప్రభువులు



శ్రీసచ్చిదానంద అవధూతగారు

## శ్రీ సచ్చిదానంద అవదూత గారి ప్రియశిష్యులు



శ్రీ నిర్మలానంద  నేతి వెంకయ్య గారు

## శ్రీ నిర్మలానంద  నేతి వెంకయ్య గారి ప్రియశిష్యులు



శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగయార్యులు

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః॥
గురు సాక్షాత్పరబ్రహ్మా తస్మై శ్రీ గురవేనమః॥



శ్లో॥ అద్వైత రహిత సిద్ధాంతం । అచల బోధనాశకం ।
వాడపల్లి రాజయోగీమ్ । ఆనందార్య గురుంభజే ॥

## శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందం రాజయోగి

## శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగయార్యుల ప్రియశిష్యులు



శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః।
గురు సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః॥



శ్లో॥ అద్వైత రహిత సిద్ధాంతం । అచల బోధ దేశికం ।
వాడపల్లి రాజయోగీం । ఆనందార్య గురుంభజే ॥

# శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందం రాజయోగి

ఓం

శ్రీగురుభ్యోనమః

# జ్ఞాపికను గురించి

జన్మభావేన మృత్యుశ్చ పరిపూర్ణం స్వభావతః

వేదాలకు పుట్టినిల్లైన భారత దేశములో మహాత్ములకు కొదువలేదు. అలాగే వరంగల్ జిల్లాకు కూడా ఆధ్యాత్మిక రంగంలో ప్రముఖ స్థానమేయున్నది. జిల్లాలో బౌద్ధం,జైనం పరిడమిల్లినట్లు స్పష్టమైనాధారాలు ఉన్నాయి. సంస్కృతములోని భాగవతాన్ని తెలుగులోనికి అనువదించిన మహానుభావుడు మన బమ్మెర పోతన్నగారు, శైవ సాంప్రదాయంలో ప్రముఖమైన బసవపురాణము వ్రాసిన పాల్కూరి సోమనాథుడు, అద్వైత పాఠ్యగ్రంధము సీతారామాంజనేయ సంవాదమును వ్రాసిన శ్రీపరుశురాంపంతుల లింగమూర్తిగారు, నాలుగు వేదములకు భాష్యమువ్రాసినవారు, వేదాంతపంచదశిలాంటి ప్రౌఢగ్రంధముల రచయిత శ్రీ విద్యారణ్యులవారు(మాధవుడు పూర్వాశ్రమనామం)కూడా వరంగల్లు వారే.

అలాగే అచలబోధ సాంప్రదాయములోనూ శ్రీమందిప్పల రాజయోగి, శ్రీ వాడపల్లి ఆగయార్యులు వరంగల్లు వారే. వారి తరువాత ముఖ్య స్థానాన్ని ఆశ్రయించినవారు శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందరాజయోగిగారు అతిముఖ్యులు.

శ్రీమదచలగురుపీఠ రాజయోగాశ్రమ పేవాసమాఖ్యను ఏర్పాటు చేసి అచలసాంప్రదాయులనందరిని ఒవతాటిపై తెచ్చి అచలప్రబోధరత్నగా కీర్తించబడినవారు. అనేక సాంప్రదాయగ్రంధాలను ప్రింట్ చేయించి అందరికి అందుబాటులోకి తెచ్చారు.

ఆగయార్యులు స్థాపించిన పీఠాలను, ఏకంచేసి, ఆశ్రమాలను పునర్నించినారు, బహిరంగంగా, ధైర్యంగా సభలు జరిపే విధానం వీరి నుండే మొదలైనది. 1975 ముందు చాలా రహస్యంగా చెప్పుకొనేవారు కొందరు ఇతర గురువుల శిష్యులను సభలో రానిచ్చే వారు కాదు. తత్వ విచారంలోను తనదైన ముద్రవేశారు.

ముఖ్యంగా వీరి బోధనల వలన ఎంతో మంది యువకులు ప్రేరేపించబడినారు. అచలబోధ అంటే అందరికి తెలిసేలా చేసిన మహనీయులు వారి జ్ఞాపకాలను గుర్తుచేసుకోవానికై ఈ జ్ఞాపిక ను తీస్తున్నాము.

వీరి మండలారాధన సందర్భముగా ఈ జ్ఞాపికను విడుదల చేస్తున్నాము. కోరిందే తడవుగా అభిప్రాయాలను పంపించి మమ్మాశీర్వదించిన సేవాసమాఖ్యఅఖిల భారత అధ్యక్షులు శ్రీశ్రీశ్రీ వివేకానంద సుబ్బయార్యులవారికి, ఉపాధ్యక్షులు శ్రీదయానంద నాగుల వెంకటేశంగారికి, రాష్ట్ర అధ్యక్షులు శ్రీభూమానంద గుత్తికొండ దామోదర్ రెడ్డిగారికి, ముద్రణకు సహకరించిన శ్రీవాడపల్లివివేకానంద్ మరియు యోగానంద్‌గారికి, శ్రీఆనంద ఆశ్రమ భక్తబృందానకి, చిన్నముప్పారము భక్తబృందము వారికి సహకరించిన ప్రతి ఒక్కరికి తక్కువ సమయములో ముద్రించి ఇచ్చిన ప్రెస్సువారికి కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు.

సదా సద్గురు సేవలో

**డా॥ కూన దయానంద స్వామి**

ప్రధానకార్యదర్శి, సేవాసమాఖ్య

sevasamakhya@gmail.com

facebook. Achalaguru peetam

# గురుపరంపర

## శ్రీగురుభ్యోనమః

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః।
గురు సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ మన్నాథా శ్రీ జగన్నాథ మద్గురు శ్రీ జగద్గురు।
మమాత్మా సర్వభూతాత్మ తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్ చరాచరం।
త్వంపదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం।
అసిపదం దర్శితం యేన తస్మై శ్రీగురవేనమః॥

శ్లో॥ చైతన్యం శాశ్వితం శాంతం వ్యోమాతీతం నిరంజనం।
నాదబిందు కళాతీతం తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ గుకారంచ గుణాతీతో రూపాతీత రుకారకః।
గుణరూప విహీనత్వం తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ త్వంపితా త్వంచ మేమాత త్వంబంధు త్వంచ దేవత।
సంసార ప్రీతి భంగాయ తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ ధ్యానమూలం గురోర్మూర్తి పూజామూలం గురోర్పదం।
మంత్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురుకృపః॥

శ్లో॥ గురుణాం అర్చయేనిత్యం గురుపాదాభి వందితం।
గురుణాం అగ్రజం శ్రేష్టం తస్మై శ్రీ గురవేనమః॥

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్య సాంప్రదాయ
కర్తృభ్యో వంశఋషిభ్యో మహద్భ్యో నమోగురుభ్యః॥

శ్లో॥ సర్వోపప్లవరహిత ప్రజ్ఞానఘన ప్రత్యగర్థో।
బ్రహ్మైవాహమస్మి అహం పదార్థరహితః॥

శ్లో॥ శ్రీ బ్రహ్మవిద్యా గురు విష్ణు సూర్యం।
శ్రీ యాజ్ఞవల్క్యం జనకం శుకంచ।
సాంధీపమీశం కృష్ణంచ అర్జునం।
వందే గురున్మే గురు పాదుకాంతం॥

శ్లో॥ అంభికాశివయోగీంద్రం అచలబోధ ప్రవర్తనం।
సాధుమార్గ వేమనార్యం సద్గురుభ్యోన మోనమః॥

శ్లో॥ శ్రీధరస్వామి యోగీంద్రం శివరామాఖ్య దీక్షితం।
కంబాలూరి అప్పబ్రహ్మం సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ పరుశురామ సీతారామ భాగవత కృష్ణయోగీనాం।
ఫీలుఖాణ లక్ష్మణార్యం సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ బృహద్వాశిష్ట సిద్ధాంతం పూర్ణబోధోపదేశికం।
వెంకటేశ్వర యోగీంద్రం సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ బ్రహ్మవిద్య సిద్ధాంతం నిర్మలానంద దీక్షితం।
శ్రీమత్ నేతివెంకటేశ్వర సద్గురుభ్యో నమో నమః॥

శ్లో॥ వేదవేదాంత సిద్ధాంతం పూర్ణబోధోపదేశికం।
ఆగయార్య రాజయోగీం సద్గురుభ్యో నమోనమః॥

శ్లో॥ అద్వైతరహితసిద్ధాంతం అచలబోధోపదేశికం।
వాడపల్లి రాజయోగిమ్ అనందార్యం గురుంభజే॥

శ్లో॥ శ్రీవాడపల్లి వంశాంబుదిచంద్రం పూర్ణచంద్రప్రదీపకం
సద్విచార ప్రవర్తంచ ఆనందార్యం గురుంభజే॥

శ్లో॥ అస్మద్గురు సమారంభం కృష్ణసాంధీప మధ్యమాం।
ఓంకారపీఠ పర్యాంతం వందేగురు పరంపరమ్॥



**అచలబోధ వాచస్పతి శ్రీవివేకానంద బండారు సుబ్బారాయుడు**

అఖిలభారత అధ్యక్షులు

శ్రీమదచలగురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య

# సశరీరులుగా లేకున్నా అశరీరులుగా ఉన్నారు

శ్రీనిత్యానంద వాడపల్లి ఆనందార్యులగురించి రెండుమాటలు.

సాంప్రదాయ గురుబంధు జనులారా! శ్రీనిత్యానంద వాడపల్లి ఆనందార్యులు జన్మతః ఒక ప్రజ్ఞాన ఘనుడు. శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగయార్య గర్భసంజాతులు. వీరి తండ్రిగారి బీజానువుల్లోనే పూర్ణభావము కలిసి వచ్చింది. అందుకే ఆయన జన్మతః నేను ఈ భావం తెలుసుకున్నానని చెప్పేవారు. ఏమాటైనా నిర్మోహమాటముగా నిశ్చయాత్మకముగా చెప్పేవారు. మన సిద్ధాంతమును ప్రంచములోగల అన్ని మతాలకంటే చ్ఛాలా గొప్పది అని చెప్పెందుకు వెనుకాడేవారు కాదు. పరమత ఖండన పరిపూర్ణబోధ నిరూపణ ఆయనకు చాలా ఇష్టం. ముఖ్యముగా చిన్నజియ్యరుస్వామిమీద ప్రారంభంలోనే విమర్శించేవారు. ఆయన జీవుడున్నాడు, ఈశ్వరుడున్నాడు, జగత్తు ఉన్నది అంటాడు, నేను జీవుడు లేదు, ఈశ్వరుడు లేదు, జగత్తులేదు అంటాను అనిచెప్పేవారు. కంధార్థములు చెప్పేటప్పుడు మతముల వారలు తమ సమ్మతమైన శాస్త్రమర్యాదలచే అనే కందార్థాన్ని తీసుకొని ఈ కంధార్థము ఒక్కటిచాలు ప్రపంచములోగల భ్రాంతి మతములను తీసివేయుటకు అని చెప్పేవారు.

ఈయన అశరీరి అయిన విధానముకూడా చాలా అద్భుతము. దేహసంబంధీకులు, రక్తసంబంధీకులు, ఆత్మసంబంధీకులు, సాంప్రదాయభక్తులు, శిష్యప్రశిష్యులు ఎంతో మంది ఉన్నప్పటికి అవసాన సమయమున ఒకరుకూడా దగ్గర లేకుండా పోవడం, తాను సర్వబంధములు వీడి సుఖమరణము చెందడం చాలా గొప్పవిశయం. ఇటువంటి అనాయాసంగా తనువు చాలించినవారు నాకు తెలిసినంతలో ఎవ్వరూలేరు. ఏది ఏమైనాగాని అయన సాంప్రదాయానికి ఎనలేని సేవచేసినాడు. శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య వ్యవస్థాపకులుగా సమాఖ్య అభివృద్ధిని ఎప్పుడుకోరేవారు. తెలంగాణ, ఆంధ్ర, మహారాష్ట్ర, గుజరాతులలో విస్తృతంగా పర్యటించి సాంప్రదాయ అభివృద్ధికి చాలా పాటుపడినారు. మరువరానివారు. వారి ఆశయాలను మరువకుండా మనమందరము కొనసాగించడమే నిజమైన నివాళిగా భావిస్తున్నాను.



**శ్రీ దయానంద నాగుల వెంకటేశం**

శ్రీమదచలగురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య

అఖిలభారత ఉపాధ్యక్షులు. సాందీప ఆశ్రమము-గొల్లగూడెం

# దివ్యమూర్తి-త్యాగమూర్తి మన ఆనందార్యులు

ఆత్మబంధువులారా! శ్రీమదచల గురుపీఠ సాంప్రదాయ పరంపరవాసులు, శ్రీసేవసమాఖ్య వ్యవస్థాపకులు శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగదాసార్యుల కుమారులు మరియు శిష్యరత్నము అగు నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు పరమపదించినందుకు శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయమునకు ఎనలేని లోటు. 1987 సంవత్సరం నుండి పరిచయము కలిగి 26 సం॥ అచలప్రబోధరత్న ఆనందార్యులు పరమపదించినందుకు నా మనస్సు చాలా బాధ పడుచున్నది.

శ్రీ ఆనందార్యులు అచలపరిపూర్ణ బోధలో చాల అనుభవముగల వారు. శ్రీశివరామ దీక్షిత సిద్ధాంతము పై స్టేజిలో అనగా ఆఖరిస్థాయిలోనే చెప్పేవారు. కందార్థములు, సిద్దాన్త శిరోమణి దీక్షితీయము మాటలు మాత్రమే మాట్లాడే వారు.దిగువస్థాయి సాంఖ్యము గురించి కాని, తారకము గురించి కాని, అమనస్కము గురించి కాని, మహావాక్యము నిర్ణయముగాని మాట్లాడేవారు కాదు. పూర్తిగా పరిపూర్ణము, ఎరుకల గురించి మాత్రము మాట్లాడేవారు, ధైర్యంగా బల్ల గుద్ది చెప్పేవారు. ఆయన ఉనికి యెల్లప్పుడు పరిపూర్ణబోధ విచారణ నిమిత్తముగా ఉండేది మరియు ఆ నందార్యుల స్థితి చాలా గొప్పది. గొప్పతనముకు కాని, ధాంబికమునకు గాని, పేరు ప్రతిష్టలకు గాని అవకాశము యిచ్చేవారు కాదు. నిజముగా ఆయన గొప్ప మహాఋషి, మంచి సాధకుడు, యిహములో, పరములో గొప్పనైన సాధకుడు. ఆయనయందు చాల సాదక లక్షణములు యుండేవి. ఆయన చాలా ధనవంతుడయ్యి యెన్నో కోట్లు సంపాదించి కుమారులు, కూతుళ్ళను బాగాచదివించి మంచి ఉద్యోగములను చేయించినారు. కాని యించుకైన గర్వము, మదము, మత్సరము లేక ఉండేవారు. తన యింటిలో ఎ/సి రూములో యుండేవాడు. చాల సున్నితమైన ఆహారమును భుజించేవారు. కాని బయట ఏ పల్లెటూరుకు వచ్చిన, ఎంత పేదవాళ్ళ వద్దకు వచ్చిన వారికి ఏమాత్రమే బాధ పెట్టక తను చక్కగ మెదులుకునేవాడు. ఏమిపెట్టిన తినేవాడు, ఇది బాగులేదు అనేమాట వారి నోటి నుండి వినలేదు.

**శ్రీ భర్తృహరి సుభాషితములో సత్పురుషుని సాదక లక్షణము గురించి చెప్పుతాడు.**

**ఒకచో నేలను పవళించు - నొకచొ నొప్పారు బూసెజ్జపైనుండు-నొకచో హంసతూలిక పాన్పుపైపవళించు ఒకచో శాలువలు ధరించు-నొకచో బొంత ధరించు-నొకచో కటికనేలపై పవళించు-ఒకచో శాఖములారగించు-నకచో శాల్యోధనములారగించు-నొకచో శుస్కన్నము భుజించు ఒక్కొక్కతరిణ్, సుఖంబున్, దుఖంబున్ మదికిన్ రానీయదు అనియు సాదక లక్షణం చెపుతాడు.** యీ గుణపద్ధతులన్ని ఆనందార్యులు వారిలో ఉండేవి.

మరియు ఆనందార్యులవారు, బోధ ధృడీకరణములోకాని, స్థితిలో కాని, చాల సమరసభావాజ్ఞులు, భగవత్‌గీతలో శ్రీకృష్ణ పరమాత్మ 12వ అద్యాయములో చెప్పినట్లు...

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్ర కరుణఏవచ ।

నిర్మమో నిరహంకార సమదుఃఖసుఃఖ క్షమీ ॥

యికతను మంచి శుచిగలవారు, శుభ్రతగలవారు.

శ్లో॥ అనపేక్ష శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః ।

సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్త సమే ప్రియః ॥

మరియు శ్రీ ఆనందార్యులు ఒకరిని నిందించడముకాని, దూషించడము కాని లేనివారు.

శ్లో॥ తుల్యనిన్దా స్తుతిర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్ ।

అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మే ప్రియో నరః ॥

యెంతగాను ఆనందార్యుల గురించి చెప్పాలనుకున్న సరిపోదు, ఆయనకు ఆయనే సాటి, త్యాగనిరతులు-గొప్ప ధాత, శ్రీమద్ భాగవత కృష్ణ ప్రభువుల వారి మందిర పున్ణనిర్మాణమునకు రూపాయలు 1,00,000/- ఒక లక్ష విరాళము ప్రకటించి తొందరగా పని ప్రారంభించాలని చెప్పిన దివ్యమూర్తి. వారికి నా దివ్యసుమాంజలులు.



**భూమానంద శ్రీగుత్తికొండ దామోదర్‌రెడ్డి,**

సేవాసమాఖ్య ఆంధ్రరాష్ట్ర అధ్యక్షులు, పొట్లపాడు

16-1-2013 న శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందంగారు పరమపదించినారని తెలిసి నిర్ఘాంతపోయాను. శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్యకు మూలస్థంభము. సమాఖ్య నడిపే విధానములో ప్రథములు. నిరంతరము సమాజ ఉద్ధరణకే ఆలోచించేవారు. స్నేహశీలి. నిగర్వి. శాంతమూర్తి. ఎవరిని నొప్పించే స్వభావములేని వారు. మనమధ్య లేకపోవడము బహుదా విచారకరము. పరిపూర్ణబోధలో నిష్ణాతులు. ఎంతోమంది భక్తులను, యువకులను యీ మార్గములో ముందుకు నడిపించిన ఆచార్యులు. అన్ని ప్రాంతాల గురుసాంప్రదాయాలను ఏకీకృతముచేయ సంకల్పించిన మార్గదర్శి. తండ్రిగారైన వాడపల్లి ఆగయార్యులు నిర్వహించిన ఈ సాంప్రదాయ సిద్ధాంతమును తనదైన శైలిలో యింకా ముందుకు ప్రజ్వరిల్లజేసిన ప్రకాశమూర్తి. సిద్ధాంతపరులని తిరుగుతూ, సిద్ధాంతము తెలియక మతబోధలుచేస్తూ, రచనలు చేస్తూ, గ్రంధవ్యాపారములుచేసి పెద్దలమని సమాఖ్యలో తిరిగే వారిని సమాఖ్యనుండి బయటకు పంపించిన ధైర్యమూర్తి.

శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందంగారు బోధలో బహుప్రవీణులు. ఎరుక పరిపూర్ణములు భిన్నమైనవిగా శివరామ దీక్షితులవారు ప్రతిపాదించిన సిద్ధాంతం. గురుశిష్యుల మధ్య జరిగే సంప్రదాయంము నిజవిచారణ. పరిపూర్ణము జన్మరాహిత్యభావాన్ని తెలియజేస్తుంది. యితరమతాల భావాలన్ని ఒక అధిష్టాన దేవతను నిర్ణయించుకొని దానివల్ల స్వర్గసౌఖ్యాలను పొందుతామని కొందరు, మానవ జన్మకువచ్చే కష్టసుఖాలను తీర్చుతారని కొందరు, వీరివల్ల మనకుమంచి జరుగుతుందనే భ్రాంతిలో కోందరు భావిస్తున్నారు. ఆత్మను అధిష్టాన బ్రహ్మముగా నిర్ణయించి ఆత్మ శాశ్వితమని అధిష్టాన బ్రహ్మమని చావుపుట్టుకలు లేనిదని ప్రపంచానికి ఆత్మకు సంబంధంలేదని ఒకే వస్తువైన బ్రహ్మను రెండుగా ఆపాదించి ఆత్మను తెలుసుకుంటే జన్మరహితమని యింతకు మిక్కిలి లేదని సంతోషపడుచున్నాను.

పరిపూర్ణ సిద్ధాంతము వీటికన్నింటికి విలక్షణమైనది. మాయాబ్రహ్మముతో కలిసి జననమరణాలకు ఆలవాలమై నిరంతరము సృష్టి, స్థితి ధర్మాలను కలిగి ఉన్నటువంటి బ్రహ్మను తెలుసుకుంటే జన్మరహితము కాజాలదు. నావల్లనే, నేనను భ్రాంతి వల్లనే సృష్టి. నేను రహితమందే జన్మరహితం. యిదే అచలపరిపూర్ణ సిద్ధాంతం. అచలప్రబోధరత్న శ్రీనిత్యానంద వాడపల్లి ఆనందంగారి ఆశయాన్ని కొనసాగిద్దాం!



## శ్రీపూర్ణానంద గొడిచెర్వు బ్రహ్మానందరెడ్డి

సేవాసమాఖ్య కేంద్ర సహాయ కార్యదర్శి

ప్రాచీనకాలమునుండి నేటివరకు మానవ సమాజము అనేక రంగాలలో అభివృద్ధి సాధిస్తూనే ఉందంటే సమాజములోని మానవకోటి ఈ సృష్టి సమస్తము ఏర్పాటుకు, స్థితికి, లయముకు కారణము అధిష్టానచేతన బ్రహ్మమని ఇది లేకనే, కలవలే, సమస్త దేశములలో, సమస్త కాలములలో, సమస్త వస్తువులయందు చావుపుట్టుకలేని స్వత సిద్దముగా ఉండే పరిపూర్ణములో తోచిన వస్తువుయని తెలుసుకొని అశరీరులై, అనహంకారులై, ఉండటానికి ప్రధాన కారణము గురువులు. గురువుల పాత్ర సకల కాలాలలో మానవలోకము శాంతిగా నిర్మలముగా, నిర్భయముగా ఉంటూ, చతుర్విద పురుషార్థ ఫలములను అనుభవించడానికి అత్యంత ప్రధానమై ఉన్నది. కావుననే మానవులు ఎవ్వరికి, దేనికి ఇవ్వనంత గౌరవము, పూజ్యనీయతనిస్తూ వారి ఆదేశాలకు విలువనిస్తూ జీవిస్తున్నారు. ఒక దేశాభివృద్ధికి దేశ సమగ్రతకు విశ్వమానవ సోదర భావాభివృద్ధికి,స్వాభిమానమునకు, స్వయంపోషణకు, సమాజ స్థాపనకు వ్యక్తిత్వ వికాసమునకు, జననమరణ ప్రవాహమునుండి బయటపడి నిజమైన జీవితము గడపడానికి గురువుల పాత్ర ప్రధానమైనది. మానవులలోని జాతి, మత, కుల, ప్రాంతీయ, వర్ణ, భాషా,లింగ, ధనపరమైన భేదాలను పోగొట్టి, సోమరితనమును, పరాన్నజీవితమును, మూఢనమ్మకాలను పోగొట్టి, అనైతిక పద్దతులను, అభిమాన, అనురాగ, అజ్ఞాన, అవివేక, అహంకారములను తొలగించి పరమానంద సుఖమును మానవులు అనుభవించుటకు గురువులపాత్ర ఎంతో ముఖ్యముగా ఉన్నది. ఇటువంటి గురువుల స్థానములో నిలిచి, తన జీవితమంతా సేవజేసినవారు అతి తక్కువ.

రాజయోగమార్గములో కుమారునిగా, మానవునిగా, సోదరునిగా, భావగా, భర్తగా, తండ్రిగా,తాతగా, మామగా, స్నేహితునిగా, బంధువుగా ఉంటూ స్వయం పోషణార్థం కర్మనుచేస్తూ అత్యంత బాధ్యతతోకూడిన, మార్గదర్శకముతోకూడిన, సమయస్ఫూర్తితోకూడిన ఆగమ, నిగమ, ఉపనిషత్, ప్రస్థానత్రయ సకలమత గ్రంధసారములుతెలిసి బృహద్వాశిష్టసిద్ధాంత వారసత్వములో, గురుపాత్రమును పోషించడము అసామాన్యమైనది.ఇంత కష్టమైన గురుపరంపరలో మన శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందం మహారాజు జీవించి తనవంతు గురుసేవజేసిన మహనీయుడు. ఇహపరములలో తన జీవితకాలమంతా, తన జీవితకాలములోని

దశలలో,అన్ని ధర్మాలను పోషించి చివరకు తన కర్తవ్యకర్మలను చేయుచూ, మనసులో ఎలాంటి కర్మలను చేయాలో చెప్పేవారు. అచలబోధ అన్ని బోధలకంటే గొప్పదని గట్టిగా చెప్పేవారు.

దేహము మాయయని, ఆత్మసత్యమని, దీనికి పూర్ణత్వాన్ని, బ్రహ్మత్వాన్ని కల్పించి, సృష్టిని సాక్షీమాత్రునిగా చేసుకొని, ఈ ఆత్మను నేనేనని నిర్ణయించి, ఇదే అధిష్టానచేతన బ్రహ్మమని, ఈ ఆవరణలోనే ఉన్నవారు అద్వైతులు. ఈ అధిష్టానచేతన బ్రహ్మమును రహితపరచి అంతటాఉండే పరిపూర్ణమే సత్యమై, శాశ్వితమైవున్నదని, నిజనిర్ధారణచేసి చెప్పేది అచలబోధ. అధిష్టానచేతన బ్రహ్మమే సకలశాస్త్రాల, మతగ్రంధాల, సృష్టికికారణమైయున్నది. బ్రహ్మమును విచారించి మూలములేకనే కలవలెతోచి, సకలభ్రాంతులకు నిలయమైన దని, దీనిని బాగుగా విచారించి ఇదివుండగా జన్మరహితము కాదని, నిజనిర్ధారణచేసి చక్కటి రాజమార్గము ఏర్పరచినవారే శ్రీశివరామ దీక్షిత సంప్రదాయ గురుపరంపర. ఇది తక్కువ బోధలవలె చిక్కులుగల బోధకాదు. కాషాయములుగట్టి, సంసారమువదిలి, సన్యాసులై, జడలు, గడ్డములుపెంచి, సృష్టిధర్మమునకు విరుద్ధముగా జీవిస్తూ, పరులసొమ్ముతో ఆశ్రమములుకట్టి, సుఖభోజనములుతింటు, ప్రజలకు అర్ధంకాని మాటలు చెప్పుచు అన్నింటికి మూలకారణమైన వస్తువే నేనుమాయయని, మాయమాటలు చెప్పేది బృహద్వాశిష్టము కాదు. స్వశక్తితో సంసారమును పోషిస్తూ ఇతరులకు భారము కాకుండా సద్గురు సన్నిధిచేరి భుక్తి, ముక్తి క్రియలను జరుపుకుంటూ గురువాజ్ఞకులోబడి సృష్టిధర్మమును పోషిస్తూ, ప్రభుత్వ చట్టములను గౌరవిస్తూ, వాటికి లోబడి జీవిస్తూ, రాజ్యాంగము ప్రకారము విధులు నిర్వర్తిస్తూ, సర్వమతముల వారిని ప్రేమిస్తూ, ఉన్నంతలో తృప్తిపడి జీవిస్తూ, పరిపూర్ణమున్నదని, లేనేరుక పుట్టనేలేదని, ఇది ఎండమావులవలె, స్వప్నమువలెనని తెలుసుకోవాలనేదే నిజగురు సంప్రదాయము. ప్రకృతి అనే పంచభూతములు పురుషుడు అనే ఆత్మఈ రెండుకలిసి ఎరుకయని నిర్ణయము. ఈ ఎరుక అనేక రకాల ఆలోచనతో వైవిధ్యముగాఉంటూ, అనేక రకాల శాస్త్రములను, దేవతలను, భ్రాంతులను ఏర్పర్చును. అన్నింటికి మూలకారణమైన ఎరుక, మూలములేకనే స్వయంభూ బ్రహ్మముగా తోచినది.ప్రకృతియను అనాత్మలేకుంటే పురుషుడను ఆత్మ ఉండదు. కావునఈ రెండు ఉపాధ్వియము.ఈ రెండింటి లోపల వెలుపల పరిపూర్ణమనే నిజదేవుడు కలడు.ఈ నిజదేవుడైన పరిపూర్ణములో కలవలెతోచిన ఎరుకయనే తెరపైన కలలోతోచిన శరీరములేలాగో ఆలాగేయని పంచదశినిఈ కలదేనిపైన తోచుచున్నదో అదే ఈమూలములేని గుర్తేరిగే శరీరము ఏమీలేదు అనే షోడశిని,ఇది దేనిపైనతోచినదో అదే ఈ ఉత్తబట్టబయలు ఏమిలేదు అనే ద్వాదశాక్షరిని శిష్యుడు త్రికరణ శుద్ధికలిగి సత్ప్రవర్తనతో, తను, మన, ప్రాణములు గురునకిచ్చి ధర్మాచరణపరుడై సాధన సంపత్తులనుకలిగి స్థాన, అంగ, భావ,ఆత్మ శుశ్రూషలను చేయుచూ ఎరుక స్వరుప, స్వభావ, స్వలక్షణ, స్వస్థానములను తెలుసుకొని,ఈ

అన్నింటిని తెలుసుకొనే తెలివియే నా నిజస్వరూపమని ఇదే ఆత్మయని, బ్రహ్మమని గ్రహించి,పరిపూర్ణమనే ఏదేవుడైతే ఉన్నాడో అట్టి దేవుని సందేహ రహితునిగా దర్శించి, ఈ పరిపూర్ణమనే దేవుడే తప్పమిగతా ఏమీలేదని,నీటియందలి తామరాకు నీటిని అంటనట్లు పాలనుండి వచ్చినవెన్న పాలను అంటనట్లు తాను ఏమియు అంటక,ఏమియులేక, చరించుచున్న పరిపూర్ణులకు జననమరణములు స్వర్గనరకములు, బంధమోక్షములనేద్వంద్వాలులేక తాననే ఎరుకను గురుదక్షణగా గురువుగారికి ఇచ్చి, గురువాజ్ఞ ప్రకారము నడచుటయే శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయము.

ఇట్టి ఘనమైన సాటిలేని మేటియైన ప్రబోధను ఎరిగి గురువాజ్ఞానుసారము గురువై అనేక ప్రాంతములుతిరిగి, తాను గురుకృపచే ఎరిగిన ప్రబోధను విని, అందరూ మాది శివరామదీక్షిత సాంద్రాయమే అంటూఉంటే విని, భావికాలంలో అసలైన శ్రీ శివరామదీక్షిత సాంప్రదాయక ప్రబోధ మరుగునపడి వారివారి వ్యక్తిగతమగా తోచిన, అర్థమైనబోధలే వ్యాప్తిచెంది, హిందూమతములో ద్వైత, అద్వైత, విశిష్టాద్వైత, శాక్త, లింగ,గాణపత్యశాఖలు ఏర్పడినట్లు, బౌద్ధమతములో హీనయాన, మహాయానశాఖలు ఏర్పడినట్లు, జైనమతములోశ్వేతాంభర, దిగంభరుల ఏర్పడినట్లు, క్రైస్తమతములో క్యాథలిక్కులు, ప్రొటెస్టెంట్లు, మహ్మదీయ మతములో షియాలు, సున్నీలు ఏర్పడినట్లు, శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయములో ఏర్పడునేమోనని దూరదృష్టికలిగి శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య అనే సంస్థను ఏర్పాటుచేసి అధ్యక్షునిగా కొన్ని సంవత్సరములు, సలహాదారునిగా కొన్ని సంవత్సరములు సేవజేసిన మహనీయుడు శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందముగారు. నేడు మనందరము సమాఖ్యలోఉండి నేటి సమాఖ్య అధ్యక్షుడైన శ్రీ వివేకానంద బండారు సుబ్బయార్యుల బోధలు విని, తనమూలమును తెలుసుకొని,అజ్ఞానాంధకారములను రూపుమాపుకొని,జననమరణ భ్రాంతులను తొలగించుకొని, ప్రపంచవాసనా రహితులమై, సంకల్పరహితులమై, అహంకారరహిత పరిపూర్ణబోధస్థితి కుదిరినవారమై,అశరీరులమై, అంటీ అంటని లక్షణములతో, మాయాజాలముకు అంటనివారమై, నిత్యతృప్తికలిగి, దృఢత్వము కలిగి, మానవజన్మను సార్థకము చేసుకుంటున్నామంటే అది శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందం మహరాజుగారి కృపవలననే అని చెప్పుకోవచ్చు.మనమందరము ఇటువంటి విశ్వమానవ కళ్యాణమును కోరిన శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందం మహరాజుగారి దివ్య మూర్తిమత్వమునకు కృతజ్ఞతాపూర్వక నమస్కారములు తెలుపుతూ మనమందరము సమాఖ్యలో జీవితమంతాఉండి మనవంతు గురుసేవ చేయుటకు ఆ మహనీయుని ఆశిస్సులు కోరుతూ...



శ్రీనిర్మలానంద నిల్లా కృష్ణమూర్తి
సేవా సమాఖ్య పూర్వాధ్యక్షులు, కాకినాడ

# అరుదైన అచలఋషి

సీ॥ శ్రీమించు శివరామ సిద్ధాంతబోధ ప్రకటపరుచునట్టి ప్రభుడవీవె।

అవనిలో అచల సమాఖ్య స్థాపించి అన్ని పదవుల నలంకరించినావు।

ధర్మాధర్మములన్ తరచి తరచియు చూచి నిత్యాఆనందవై నిలిచినావు।

పరిపూర్ణబోధ పరంపరా వాసులను ఏకతాటిపై నడిపించినావు

హనుమకొండలో నిలుచున్న ఘనచరిత్ర

మినుల సుమనభావ నిన్ వినుతిజేయ

జాలరయ మమ్ముబ్రోవవే సచ్చరిత్ర

మమ్ము పాలించిబ్రోవుమా మిన్నురహిత॥

ఇది చాలా బాధతో వ్రాస్తున్నాను. ఏమి వ్రాయాలో తెలియటంలేదు. శ్రీనిత్యానంద స్వాములవారు సేవా సమాఖ్యకు చేసిన సేవ అమోఘం. వారులేనిలోటు పూడ్చుటకు దిట్టగా బోధకులను తయారుచేసినారు. అయినా అంతటి నిర్మోహమాటంగా చెప్పేవారు లేరు. సేవా సమాఖ్య ఒక మహానుబావున్ని, ఆణిముత్యములాంటి అరుదైన అచల్బషి కోల్పోయింది.



## సదానంద శ్రీ దాసరి చంద్రమౌళి

సేవాసమాఖ్య ఉత్తరతెలంగాణ అధ్యక్షులు, పెంచికలపేట

## 'నన్ను నీవు నిన్ను నేను విడలేను '

సేవా సమాఖ్య వ్యవస్థాపకులు శ్రీ అచలప్రబోధరత్న నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు గత 12 సంవత్సరములనుండి మా సభకువచ్చి అధ్యక్షులుగా ఉండి మమ్ములను ఎంతో ఆనందపరిచినారు.వారు ఈ సిద్ధాంతములనుగూర్చి, ఇతరసిద్ధాంతములను ఖండనచేసి, శ్రీబాగవతక్రిష్ణప్రభువులవారి కందార్థములతో శ్రీశివరామదీక్షిత సిద్ధాంతపరముగా చేప్పేవారు. ఇతర సిద్ధాంతములు ఎన్ని ఉన్నప్పటికైనా జననమరణాల హేతువని జన్మరహితమార్గం కాదని ఖండనచేసి దీక్షిత సిద్ధాంతమును నిరూపించి చెప్పేవారు.

గత 12 సం॥ములనుండి ఎన్నో కార్యక్రమములకు పొయ్యేవారము. కాకినాడ,భీవండి,షోలాపూర్, కదిరిఎన్నో సభలకు సభాధ్యక్షులుగా ఉన్నారు. మాతో చాలా స్నేహంగా ఉన్నారు. మేము కలిసిమెలసి సభలు చేసేవారము. అతని దగ్గర ఆడంభరాలు లేవు. మేము దూరప్రయాణాలకు పోవలసివస్తే వారు నాకు, శ్రీబొప్పారాములుగారికి రిజర్వేషన్ చేయించేవారు. మేము ముగ్గురము కలిసిపోయేవారము. హెూటల్లో టిఫిన్ చేస్తే మాకన్నా ముందుగానే వెళ్లి బిల్లుకట్టేవాడు. బోధగురించి సిద్ధాంతపరంగా చెప్పేవాడు. ఇతర మతాల గురించి ఎన్ని తెలుసుకున్నా కోరికలగురించి, భోగభాగ్యాల గురించేకాని జననమరణ రహితము గురించి కాదు, అని చేప్పేవారు.

ఒక సందర్భమున మానాన్న శిష్యుల ధనంవలన పోషింపబడినాము. నా శరీరం మానాన్ననుండి వచ్చినరక్తం వలన ఏర్పడింది. వారికే నా శరీరము వినియోగించాలి. పెద్దకొడుకుకు ఒక్కడే కొడుకు,చిన్నకొడుకు ఒక్కతే బిడ్డ. ఏదైనా అయితే ఎట్లా? అని అమ్మగారు అగడిగేతే, అనాద పిల్లలు ఎందరో కలరు, వారిలో ఒకరిని దత్తత తీసుకోని సాదుకుంటాం. ఎవరికి బాకి ఉంటే వారే తింటారు. ఎవరైతేనేం వారు మన పిల్లలుకారా? అని సభలో తన కుటుంబ విషయాలనుకూడా భ్రాంతిరహితంగా చెప్పేవారు.

సభలో ప్రశ్నలువేసి జవాబు వారే చెప్పేవారు. ప్రశ్నలను నిర్భయంగా అడగమని చెప్పేవారు. ఎదుటి వారికి సంశయంలేకుండా సమాదానం చెప్పేవారు. ఎందుకు మీరే ప్రశ్నలు వేస్తూన్నారని అడిగితే సాంప్రదాయం, పరంపర, గురుశిష్యులు, వేదము, శ్రుతి మొదలగు పదాలకు ఒకే అర్థం. అందుకే క్రిష్ణప్రభు "మోదమున

బ్రద్దుబోకకు వాది ప్రతివాదులనుచు వరగురు శిష్యుల్ వాదించిరనుచు నొక సంవాదము గల్పిస్తి కలగా వదలాక వినుడీ" అని అన్నారు. ఉపనిషత్తులు ఇదే విషయాన్ని చెప్పినయి. ఉపనిషత్తు అంటేనే గురువుదగ్గర క్రిందకూర్చుండి చదువుకొనుడని అర్థం. అందుకే అతనికి శ్రోత్రియుడు, బ్రహ్మనిష్టుడు అనిపేరు. శ్రీశిరామదీక్షితులు చెప్పనబోధ ఏ మాత్రం మార్పులేకుండా మనకు గురుపరంరగా అందింది కాబట్టే సాంప్రదాయమన్నాం. గురుశిష్యులు లేకున్నా దేవుడు దయ్యం,భూతం ఉండవచ్చుకాని, విద్యఅనేది ఉండదు. అఖండతత్వము, నిరాకారము, సర్వవాపకమైన ఎరుకే సాకారమైన గురువుగామారి పరకాయములయందు ప్రవేశించినది. శ్రుతి "ఆచార్యవాన్ పురుషో వేద్ద" గురువు కలిగియున్నవాడే జ్ఞానాన్ని పొందుచున్నాడు.'జ్ఞానాదేవతు కైవల్యం' జ్ఞానమువలనే మోక్షము తప్ప ఇతరమార్గములు వ్యర్థమైనవి. కనుక మనమే విన్నప్పుడు శ్రోత్రీయులము,శిష్యులం; మనమే అనుభవించినప్పుడు బ్రహ్మనిష్టులము, గురువులము అని చెప్పేవారు.

వారి ఇంట్లో ఎన్నో సౌకర్యాలు ఉన్నప్పటికి కార్యక్రమాలకు వెళ్ళినచోట ఎలాంటి సౌకర్యాలు లేనప్పటికి అచలబోధమీదగల ప్రేమచేత నిరాఢంబరముగా సర్ధుకుపోయేవారు. ఒక సందర్భములో ఒక కార్యక్రమములో కం॥ పుట్టుట గిట్టుటలేకను పుట్టేగిట్టేటియెరుక....ఈ శరీరము ఎక్కడపోతుందో,ఎలా పోతుందో అనిచెబుతూ భ్రాంతిలేకుండా జీవించేవారు.

కం॥ ద్వైతాద్వైత విశిష్టులు । సైతురు విని సైసరెపుడు సైసక పిదపన్।

సైతురు క్రమమున వేరన । నాతతిమతి జీవశివుల నవి వినబోకూ।

॥నే బోధించినది విడబోకూ॥ పూతమౌ బయలును పొడజూచి గురునీచె।

ద్వైతాద్వైత విశిష్టాద్వైతాములను మాను మవి వినబోకూ ॥ నే బోధించినది విడబోకూ॥

ఈ కందార్థమును వివరిస్తూ జీవుడు,ఈశ్వరుడు,జగత్తు అనేమూడింటి నిర్ణయములోనే మతములు ఏర్పడినవి.

ఉన్నది పరిపూర్ణము లేందెన్నటికి యెరుకయనుచు ఇదిదృఢమౌదాక అనిచెప్పి పరిపూర్ణబోధను అందరికి దృఢమయ్యేట్లు చెప్పేవారు. మేమిద్దరము కలిసిమెలిసి"నన్ను నీవు నిన్నునేనువిడలేను" అనే కందార్థము రీతి మొదిలినాము. ఏమని వర్ణింతు! ఏమని పొగుడుదు! నాతరముగాదు.



**ప్రేమానంద బొప్పారాములు, పెదలింగాపురం**

# మా కలయిక సమాప్తి అయినది

శ్రీమదచల గురుపీఠ రాచయోగాశ్రమ సేవాపమాఖ్య స్థాపకులు శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు వారియొక్క మొదటి పరిచయము 1984 ఆశ్వీజపౌర్ణమి పోతుగల్లు పూజకు వారి రాకడకు చాలామంది పెద్దలు మరియు భక్తులు చూస్తూయుండగా నేను వారినిచూచిచాలా ఆనందములో మునిగి పోయినాను. వారి రాకడతో అందరూ పాద దర్శనము చేయుచుండగా నేనుకూడా వారి పాదదర్శనము చేసుకుంటిని. మా గురువుగారు శ్రీభూమానంద మండల వీరయ్యగారు శ్రీ నిత్యానందులవారిని పరిచయము చేయించి" ఈ రాములు నా శిష్యుడు. నేను బొంబాయిలో ఉంటాను. కావున ఇతనిని మీకు అప్పగిస్తున్నాను. ఇతనిని మీరు మీ కుమారునిగా మీవద్ద ఉంచుకొని పూర్ణబోధను తెలిపి కృతార్థునిగా చేయుడు"అనినన్ను వారికి అప్పగించినారు. నాటినుండి నేటివరకు నేను అదే విధముగా మొలగినాను.

వారు హన్మకొండలో ఉండేవారు ఉద్యోగము చేయుచూ, పూజలకు హాజరగుచూ, అధ్యక్షతవహిస్తూ, పత్రికలు ప్రింటుచేయించి, అందరి అడ్రసులు వ్రాసి పోష్టుద్వారా పంపేవారు.

వారితో కలిసి ఎన్నో పూజలకు వెళ్లినాను. గత 12సంవత్సరాలనుండి శ్రీదాసరి చంద్రమౌళిగారుమేము ముగ్గురం వెల్లుచుంటిమి. మాముగ్గురిని చూచి అందరూ ఎంతో ఆనందపడేవారు.అసూయపడేవారు. మాది ఎన్నెన్ని జన్మ బంధమో ఊహించలేను.

బోధలో ఎరుక నిర్ణయములో పిండబ్రహ్మాండముల కందార్థం చెప్పేవాడు.

కం॥ పిండ బ్రహాండంబులు రెండును యారెంటిలోని రెండహములు యీ।

ఖండములు నాల్గుగూడి యఖండంబగు యెరుకరూపు గనరా మాతండ్రీ॥

యిది దేల్పిన ఘనుడే తల్లిదండ్రీ॥ ఖండాఖండములూగ గనిపించె యెరుకానె।

దండీదనెటి యుద్ధండూల కలనైన గనరామాతండ్రీ॥యిదిదేల్పిన ఘనుడే తల్లిదండ్రీ॥

పరిపూర్ణమును జేప్పేటప్పుడు ఈ కందార్థమునుచెప్పేవారు.

కం॥ పరిపూర్ణములో దోచిన। యెరుకే కల లేనియెరుక నెరిగి మృషయని యీ।

మరుగెరుక కెరుకదెల్పిన। యెరుగుటమె మేల్క సుమ్మీ యిది యామారకుమీ॥

సద్గురు వాజ్ఞ కెదిరీ మీరకుమీ॥ యెరుక యీరీతిగ యెగిరి పోయినవెనుక।

పరిపూర్ణ మొకటుండు పలుకారాదెట్లందు నిది యామారకుమీ॥సద్గురు॥

ఈ విధముగా పరిపూర్ణమెరుకలను నిర్ణయము చేసిన ఘనుడు. వారికి నాకు ఉన్నబంధము చెప్పటానికి ఊహ సరిపడదు.

తేది 9-1-2013 షోలాపురంలో కడసారి పూజాకార్యక్రమములో సభాధ్యక్షస్థానములో వుండి అందరి హృదయములో నిలిచిపోయే ఉపన్యాసం చేసినారు.11న ఉదయం సింకిద్రాబాదులో మా కలయిక సమాప్తి అయినది. 16-1-2013న 10-50ని॥లకు ఫోనుచేసినాను. ఆయ్యా! ఆరోగ్యం ఎట్లా ఉన్నది అని అడిగితే అట్లనే ఉన్నది బయట ఉన్నాను. నీవు మాత్రం తప్పకుండా చిన్నముప్పారం పూజ(23-1-2013)కు రమ్మని చెప్పినారు. నాదే చివరి ఫోనట.

**శ్రీ పూర్ణానంద గుడిబోయిన బిక్షం, శ్రీ పరమానంద సామ వెంకన్న**

చిన్నముప్పారము భక్తబృందము

# మా హృదయంలో ఉన్నారు.

శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు మాతృశ్రీ భక్తానంద తూడి దేవమాంబగారు 1974 లో పరమపదించగా వారి మండలారాధనకు మా గురువుగారు శ్రీబోధానంద కాయిత వెంకటదాసుగారు మమ్ములను తీసుకొని వెళ్లినారు. అక్కడ శ్రీనిత్యానంద వాగపల్లి ఆనందంగారిని మాకు పరిచయము చేసినారు. అ తరువాత సేవాసమాఖ్య ఏర్పాటు చేసి 1980 భక్తానంద ఆశ్రమము శివనగర్‌లో దేవమాంబగారి ఆరవ ఆరాధనకు శ్రీబండారి సత్తయ్యగౌడు, నిర్మలానంద పిల్లలమ్రి భీమయార్యులు, అచలానంద శ్రీకూన లక్ష్మణార్యులు, బోదానంద శ్రీగూడూరు చెన్నస్వామిగారు, సమాఖ్య అధ్యక్షులు బోధానంద బొద్దుల కృష్ణగారు, నిత్యానంద శ్రీబింగి రాజయ్యగారు, ఆగదాసుగారి శిష్యుడు నిజానంద శ్రీభూఖ్యబాలాజి సింగుగారు మొదలగువారు సభలో పాల్గన్నారు.సభకు అధ్యక్షుడుగా నిత్యానంద వాడపల్లి ఆనందంగాను వ్యవహరించారు. సేవాసమాఖ్యను గురించి నియమావళి చదివి వినిపించినారు.అది విని ఎంతోమంది విరాళములు ప్రకటించినారు. అది చూచి మేముకూడా ఇటువంటి కార్యక్రమము చిన్నముప్పారంలో జరిపించాలని నిర్ణయించి పాల్గుణమాసం పౌర్ణమి రోజున శ్రీనిత్యానంద ఆనందార్యుల అధ్యక్షతలో సమాఖ్య బాడి మొత్తం కలిసి ఊరంతా కదిలివచ్చేవిధముగా కార్యక్రమమును నిర్వహించినాము. వారి మాటలు వినాలని చుట్టుప్రక్కల గ్రామాలకు పత్రికలు పంపి వారందరిని రప్పించి సభలు జరిపినాము. ఆ రోజునుండి ఈ రోజువరకు పూజా కార్యక్రమములను నిర్వహిస్తున్నాము. అన్ని కార్యక్రమాలకు వారే అధ్యక్షులు. ఎంతో మంది పెద్దలు మా సభకు హాజరైనారు. వారి అమూల్యమైన మాటలు మాకు వినిపించినారు.

శ్రీ నిత్యానంద ఆనందార్యులు స్థూలరూపకముగా లేకపోయిననూ, సూక్ష్మరూపములో మా హృదయాలలో నిలచి యున్నారు. వారు చేసిన బోధనలు మా చెవులల్లో మారుమ్రోగుచునేయున్నవి.



**శ్రద్ధానంద డా॥ చేర్యాల బలరాం,**

రాజగోపాలపేట జి॥ మెదక్

## ఆనందం అను పేరుకు తగినట్లు ఆనందాన్ని ఇచ్చేవారు

పూర్ణభావజ్ఞులు సద్గురువులు, అచలప్రబోధరత్న నిత్యానంద వాడపల్లి ఆనందముగారు బ్రహ్మైంద్యైక్యము చెందిరి. సునాయసంగా కన్నుమూసిరి. సిరిసంపదలతో తులదూగుతూ వీరికుటుంబము వీరిధర్మపత్నియందు ముగ్గురు కుమార్తెలు, యిరువులు కుమారులు మరియు మనుమలు మనుమరాండ్లు కలరు. వీరు సదా గురుకృపకు పాత్రులై జననమరణ భ్రాతిరహితులై అశరీర పద్ధతియందు కాలము గడుపుచుండిరి. వీరు కరుణా రసార్థహృదయులు మృధుమధుర సంభాషకులు. ధార్మికులు. ఇతరుల మనస్సును నొప్పించనివారు. ఎట్టి కష్టములనైనా భరించి గురుపూజా వార్షికోత్సవములలో పాల్గొనుచు వారి ప్రబోధామృతములచే భక్తులను కృతార్థులను చేయువారు. వీరితో నాకు పది సంవత్సరములు అనుబంధము కలదు. వీరి నాన్నగారు పూర్ణానంద వాడపల్లి ఆగదాసుగారు మా గురువుగారి గురువు. అందువలన నన్నేంతో ప్రేమతోచూచేవారు. మా స్నేహమువలన వ్యక్తిగత అభిప్రాయములకు దూరమై పరిపూర్ణబోధ ప్రచార విధానము కొంతవరకు అలవడినది. ఆయన అనుబంధ పీఠములను ఏర్పరచిన తీరు భక్తుల సమీకరణ, ఆయన వచ్చినంతనే అందరికి ఒక విధమైన ఆనందము కలుగు విధము మనలనెంతో సంతోషపరిచినది. ఇప్పుడు ఆయన లేనిలోటు తీరనిది. కాన విచారము కలుగుచున్నది. శ్రీ గురుపరమాత్మ వారి కుటుంబ సభ్యులకు సుఖశాంతులొసగి కాపాడాలని ప్రార్థిస్తున్నాను.



**శ్రీవాడపల్లి కరుణానందం, సోదరుడు**

**ఏటూరునాగారం**

# *వారే నా తల్లి, తండ్రి, గురువు*

ఒక మహాయోగి గురించి మాట్లాడాలంటే నేను అర్హుడనౌతానో కానోకాని, వారు నన్ను 5 సంవత్సరములనుండి ప్రేమతో పెంచిన సోదరుడు, కాబట్టి రెండు మాటలుచెపుతున్న.

శ్రీమదచల పీఠాధిపతులు శ్రీనిర్మలానంద నేతి వెంకటేశ్వరస్వామివారి ప్రియశిష్యులైన మా నాన్నగారు శ్రీపూర్ణానంద వాడపల్లి అగయార్య రాజయోగిగారు పరమపదించిన తరువాత వారిజేష్ఠపుత్రుడు మాపెద్దన్నగారు శ్రీనిత్యానంద వాడపల్లి ఆనందార్య రాజయోగిగారు కుటుంబ బాధ్యతలను స్వీకరించి తల్లిగారిని, తమ్ముల్లను, చెల్లండ్లను మరియు తన సంసార బాధ్యతను సంపూర్ణముగా తీర్చిదిద్దిన త్యాగశీలి.

మా నాన్నగారు పరమపదించినప్పుడు నా వయసు 5 సంవత్సరములు. నన్ను సాది విద్యాబుద్దులు చెప్పించింది మా అన్నయ్యే. వారికి కృతజ్ఞతాపూర్వకముగా **'ఆనంద శిశుమందిర్''** అనే స్కూలు వారి పేరుతో స్థాపించినాను. అప్పటినుండి ప్రతిరోజు భోజనం ముందు వారినే తలుచుకొని భోజనంచేస్తా. కారణం వారే నా తల్లి, తండ్రి, గురువు. మా నాన్నగారి స్థానాన్ని లౌకికంగాను, పారమార్ధికంగా పూర్తిచేసిన నిండుకుండ,మహాయోగి. సేవాసమాఖ్య వ్యవస్థాపకులుగా, అచలప్రబోధరత్నగా వెలుగొందిన శ్రీవాడపల్లి ఆనందంమహారాజుగారి పాదపద్మములను నా కన్నీటితో అభిషేకము చేస్తున్నాను. వారే నా గురువు. వారి బాటలో నడుచుటకు సంసిద్ధుడైన 'కరుణమై'.



**శ్రీ పోలం మాధవరెడ్డి వ॥ వెంకటనరసింహారెడ్డి**

**గ్రామము పెద్దాపురం**

# నేనెరిగిన శ్రీనిత్యానంద వాడపల్లి ఆనందార్యులు

నా చిన్నతనములో 1947 సంవత్సరము వీరి తండ్రిగారు శ్రీపూర్ణానంద ఆగయార్యులు రజాకార్ల దౌర్జన్యాల కారణంగా ఉల్లిగడ్డ దామెరలో కుటుంబ సమేతముగా కొంతకాలము నివసించినారు. ఆ కవిపుంగవుని మా నాన్నగారు శ్రీ పోలం వెంకట నర్సింహారెడ్డిగారు, శ్రీ వెంకట్రాంరెడ్డి తాతగారు, శ్రీ తుమ్మనపెల్లి లక్ష్మోజు పటేలుగార్ల ఆర్థిక సహాయముతో శ్రీ వెంకటేశ శతకము రచించినారు. ఆ శతకములో దాతల ఫోటోలుకూడా ప్రింటుచేసినారు. దాతలు కాలగర్భంలో కలిసిపోయినా కవి రచించిన శతకముతో వారి ఫోటోలు శాశ్విముగా నిలిచినారు.

కొంతకాలము తరువాత గ్రామస్తులు, ముఖ్యముగా శ్రీతంగళ్ళపల్లి రాజేంద్రరాజయోగి కోరికననుసరించి, ఆత్మకూరు మండలం పెద్దాపురం గ్రామములో నాయొక్క పిత్రార్జితమునకు సంబంధించిన స్థలము సర్వేనం. 730. రెండు ఎకరాలభూమి నిర్మలానంద ఆశ్రమము నిర్మాణము నిర్వహణకై దానపత్రము వ్రాసి ఇచ్చినాను. ఈ రోజు ఆస్థలములో శాశ్విమైనఆశ్రమ నిర్మాణములు జరిగినవి. ఇంకా చాలా అభివృద్ధి చేయవలసియున్నది. తేది 3-2-1991 రోజున నిర్మలానంద ఆశ్రమము శంఖుస్థాపన పూజాకార్యక్రమాలు మామిడాకు మరియు బంతిపూల తోరణాలు, కొబ్బరిమంటపాలు, బ్రహ్మోత్సవాను తలపించినాయి. వైజ్ఞానిక వేదాంతసభ జరిగినది. అట్టి సభకు మహోన్నతవ్యక్తి శ్రీనిత్యానంద వాడపల్లి ఆనందార్యులు అధ్యక్షస్థానమున అధిష్టించి నన్ను వేదికపై ఆహ్వానించి, పూలమాలను అలంకరించి, పట్టుశాలువాతో సన్మానించి,మీ నాయనగారు ఆర్థిక సహాయముచేసి పుస్తకము ప్రింటుచేయించినారు. ఈ రోజు మీరు ఆశ్రమముకొరకు భూదానము చేసినారు. కలియుగమున్నంతవరకు మీకు శాశ్వతకీర్తి దక్కుతుంది అని సెలవిచ్చినారు.

ఆ మహనీయుడు స్వర్గస్థులైనారని తెల్సి చాలా బాధకలిగినది. వారి అచలబోధ వర్ణణాతీతము. వారి ప్రతి వేదాంత సభకురావాలని, వారితో కలిసి మాట్లాడవలెనని, నా మనసు పదేపదే కోరుకునేది. వారి వాగ్ధోరిని సభను ముగ్ధులను చేసేది. మహా మహాపండితులు వారి వాక్చాతుర్యానికి అనందపడేవారు. వారి బోధగురించి ఎట్లా వర్ణించాలో తెలియటంలేదు. ఈసమాఖ్యకు అణిముత్యం. వారికి స్వర్గప్రాప్తి కలుగవలెనని భగవంతుని ప్రార్థిస్తున్నాను. వారి పిల్లలకు ఆయురారోగ్యములు కలగాలని ప్రార్థిస్తున్నాను.



**సమరసానంద శ్రీ పోరెడ్డి రమణారెడ్డి**

సేవాసమాఖ్య వరంగల్ జిల్లా అధ్యక్షుడు

## కతృత్వరహిత కర్మాచరణము

అచలప్రబోధరత్న శ్రీ నిత్యానంద ఆనందార్యులు అనగానే అందరికి కర్మసిద్ధాంతమే గుర్తుకు వస్తుంది.వారు చెప్పిన కర్మసిద్ధాంతము, కర్మరాహిత్యము,కతృత్వరహితవిధానము. గూరించి కొంచము చర్చించుదాం.

అచల సిద్ధాంతం కతృత్వరహిత కర్మాచరణ విధానాన్ని ప్రవేశపెట్టింది.

1) కర్మాచరణము 2) కర్మత్యాగము 3) కర్మఫలత్యాగము 4) కతృత్వరహిత కర్మాచరణము.అని నాలుగు రకాలుగా చెపంపబడుచున్నది. చివరిదే అచలుల విధానము.

1) కర్మాచరణము

కం॥ కర్మమునబుట్టు జంతువు। కర్మమున వృద్ధిచెందు కర్మమునజెడున్।

కర్మమె జనులకు దైవము। కర్మము సుఖఃదుఖములకు కారణమధిపా॥

కర్మలుచేయుటం ముఖ్యముగా ధానధర్మములు,యజ్ఞయాగాదులు నిర్వహించి పుణ్యఫలాలుపొంది,ఆయాలోకములలో వాటిని అనుభవించి, క్షీణేపుణ్యం మర్త్యలోకం విశంతి అని,జననమరణములుచెందుచు, కర్మమే దైవమని ఈశ్వరున్ని తిరస్కరించిన వారు పూర్వమీమాంసకులు.

2) కర్మ త్యాగము

నహి కశ్చిత్ క్షణమపి జాతు తిష్టత్యకర్మకృత్॥2-5। ఏ ఒక్కడుకూడా క్షణకాలమైనా కర్మచెయ్యకుండ ఉండలేము, కర్మలుచేయుట వలన వాటి ఫలాలు అనుభవించాలి.కొన్ని ఫలాలు ఈ జన్మలోనూ, మరికొన్ని ఫలాలు రాబోవు జన్మలోనూ అనుభవించాలి. అందుకోనం మళ్ళీ జన్మనెత్తవలయును. జన్మించినాము కాబట్టికర్మచేయాలి,కర్మలనుభవించుటకు జన్మలెత్తాలి అనే అనవస్థాదోషములోపడి జన్మకర్మ చక్రములో పరిభ్రమించుటకన్న, కర్మత్యాగముమేలని సన్యసించటం కర్మత్యాగము. వీరు నిజముగా కర్మసన్యాసులుకారు. ఇతరుల పాపాలకూడుతినేవీరు మానసిక కర్మలను త్యాజించుట దుర్లభము.

3) కర్మ ఫలత్యాగము

ఇక మిగిలినది కర్మఫలత్యాగము, వీరికి భక్తులని, వేదాంతులని పేరు. భక్తులు ఫలాన్ని ఆశించే కర్మలుచేస్తారు. వీరిలోనే అర్తులు, అర్థార్తులు, జిజ్ఞాసులు చేరి పోతారు. మిగిలిన వారు జ్ఞానులు వారికే వేదాంతులని, అద్వైతులని పేరు. జఢమైన కర్మలు ఫలాన్ని ఇవ్వవు. ఫలాన్ని అనుభవించేది అనగా కతృత్వ,భోక్తృత్వములకు కారణము మనస్సు. ఆత్మ అకర్త, అభోక్త. కాబట్టి మనోరహితమునందే,లేదా అమనస్కము వలన ముక్తని వీరిభావము. నిజానికి కర్తే బోక్త, భోక్తేకర్త. కర్తభోక్త అనే అద్వైతములో ఔపచారికమే. కాబట్టిఫలసమర్పణ కుదరదు.

4) కతృత్వరహిత కర్మాచరణము

కర్తలేకుండా కర్మ ఎలా జరుగుతుంది ?

కతృత్వములేకుండా కర్త, కర్మ ఎలా చేయగలదు ?

అసలు కర్త అనగా ఎవరు ? కర్మ అనగా ఏమిటి ?

ఈ ప్రశ్నలకు మనం సమాధానాలను పొందగలిగితే కొంతవరకు అర్థంచేసుకోగలము.

భూతభావోద్భవకరో విసర్గ కర్మ సంజ్ఞితః॥8-3॥ సకలజీవుల సృష్టి క్రియకే కర్మయనిపేరు. అనగా జన్మకే కర్మయని పేరు.

శ్లో॥ కిం కర్మ కిమకర్మేతి కవయో2ప్యత్ర మోహిత్గా॥గీతా3-16॥

ఏది కర్మో, ఏది కర్మకాదో పండితులుకూడా తెలియలేరు.

శ్లో॥ కర్మణోహ్యాపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః

అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణోగతిః॥

'కర్మ' గురించి, 'అకర్మ' గురించి మరియు 'వికర్మ' గురించి తెలుసుకోవాలి. ఎందుకంటే కర్మతత్వము చాలా నిగూఢమైనది. వికర్మ అనగా కర్మకానిది, అకర్మకానిది.

కర్మఅంటే క్రియ అని, మంచిగాని చెడుగాని ఏదో ఒక ఫలం ఎప్పుడో ఒకప్పుడు ఇస్తుంది, కాబట్టి కర్మ అని అంటున్నాము. పుణ్యానిచ్చేవి పుణ్యకర్మలు, పాపాన్నిచ్చేవి పాపకర్మలు. 'యత్ స్తూయతే తత్ విధీయతే, యత్ నింధ్యతే తత్ నిషిద్ధ్యతే' విధి, నిషేదములను అనుసరించి కామ్య, నిమిత్త, నైమిత్తిక, నిషేదకర్మలుగా విభజించినారు.

అకర్మ అనగా అది కర్మకాదు క్రియకాదు, దానివలన ఎలాంటి ఫలితాలు రావు.

వికర్మ ఇది విశేషమైన కర్మ. అకర్మరూపకమైన కర్మ కావున వికర్మ. ఇందులో కర్మ లేదా క్రియ జరుగుతుంది కాని దాని ఫలితాలు మాత్రం రావు. ఒక వేళ ఫలితం వచ్చినట్లు కనబడినా దాని ప్రభావము కనబడదు.

శ్లో॥ కర్మణ్యకర్మ యః పశ్యేత్ అకర్మణి చ కర్మయః। స బుద్ధిమాన్ మనుష్యేషు ॥

కర్మయందు అకర్మను, అకర్మయందు కర్మను చూచువాడు మనుషులందు బుద్ధిమంతుడు. ఇదే వికర్మ. ఇదే కతృత్వరహిత కర్మాచరణమునకు మూలము.

శ్లో॥ జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమహుః పండితం బుధాః॥

ఎవని కర్మలన్ని జ్ఞానాగ్నిచేత దగ్ధమగునో అతన్ని జ్ఞానులు పండితుడందురు.

కర్మసిద్ధాంతమును వలన కర్మలకు కర్మఫలాలు మాత్రమే ఉంటాయి. కొన్ని దృష్టఫలాలు మరికొన్ని అదృష్టఫలాలు. వెంటనే ఫలంవస్తే దృష్టం అని, అలస్యంగా వస్తే అదృష్టం అని అంటారు. అంతేకాని కర్మల వలన కర్మఫలాలుగాని, కర్మలుగాని రహితంకావు. పుణ్యకర్మలుచేస్తే పుణ్యఫలాలు వస్తాయే కాని, గతంలో చేసి పాపకర్మలు ఏవి నశించవు. ఇవన్నీ ఎరుకతోనే వస్తాయి, ఎరుకతోనే పోతాయి.

కం॥ పాపములు పుణ్యములు భువిని। ప్రాపించును యెరుకచాత భ్రమసినవారిన్।

ప్రాపింపవెరుక నెడసిన। తాపసులను చిత్తమందు తగదెల్సుకొనుమీ॥ ఆగామి బోధలెప్పా వినుమీ॥ ఎరుకున్నంత వరకు పాపపుణ్యాలు ఉంటాయి. ఎరుకపోతేనే దానితో అన్నిలేకుండాపోతాయి.

శ్లో॥ యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కలేవరమ్।

తం తమేవైతి కౌంతేయ సదా తద్భావభావితః॥గీత। 8-6॥

మానవుడు అవసానదశయందు ఏఏభావములు స్మరించుచు దేహత్యాగము చేయునో అతడు తరువాత జన్మలో అస్వరూపమునే పొందును. ఎందుకంటే అతడు ఎల్లప్పుడు దానినే స్మరించును. ఎరుక మరుపులు జ్ఞానముయొక్క స్వభావములు. బలమైన స్మరణచే మనం నిద్రించి,లేవగానే అవిషయమే గుర్తుకు వస్తుంది. అలాగే మరణముయందు కూడా అధేవిధముగా జరుగును. స్మరణకు మూలం ఎరుక. ఎరుక ఉపాధిని కూడడము జననము. ఉపాధిని విడవడము మరణము. జడమైన ఉపాధికి చేతనత్వము లేదు. పుట్టేగిట్టేటిది ఎరుక. ఎరుకయొక్క మరుపు దశలైన నిద్ర, మూర్ఛ, సమాధి, మరణమను నాలుగు అవస్థలలో ఎరుక లేనేలేదన్నట్లుగా ఉంటుంది. కాని

నిజముకాదు. ఈ నాలుగు దశలు కాలమురీత్యా అనులోమక్రమములో ఉండే తాత్కాలిక స్థితులే, తప్ప శాశ్వతమైనవికావు. కావున ఈ నాలుగు దశల కొరకు ప్రయత్నాలు వ్యర్థమైనవే.

జ్ఞాత అనగా ఎరిగేవాడు తన జ్ఞానేంద్రియములైన శ్రోత్రము,త్వక్కు,చక్షువు,జిహ్వా,ఘ్రాణములచేత, శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములను విషయములను, ప్రమేయము అనగా ఎరుగబడే ప్రపంచమును, గ్రహించి జ్ఞప్తియందు ఉంచుకొనట లేదా అనుభవించి కర్మేంద్రిములద్వారా వెళ్ళడి చేయుటే కర్మయని పేరు. తనువు,మనసు,వాక్కను త్రికరణముల ద్వారా కర్మ జరుగుతుంది. జడమైన త్రికరణములను కర్మజేయుశక్తి ఎరుక వలనే జరుగుచున్నది.

" ఎరుగుట జ్ఞానము దానను జరిగేపని కర్మమనుచు జనులెన్నిరి

యీ యెరుకయు కర్మము లేనిదె పరిపూర్ణము" అని,

అందుకే దీనిని జ్ఞాన కర్మసముచ్ఛయమని చెప్పినారు.

కం॥ ముడిబడి కర్మము జ్ఞానము। విడువక నారెండువెలసె విశ్వమననదే" కాబట్టి

కం॥ జ్ఞానకర్మ స్వరూపము।గాని బయల్ నదిగో చూచి కలకాలము యీ।

జ్ఞానకర్మ స్వరూపం।బౌ నిను నీవెరిగి మృషని పనివినవోయీ॥ అని జ్ఞానకర్మలకు మూలమైన వస్తువే ఎరుక కనుక సత్యమైన పరిపూర్ణమును, అసత్యమైన ఎరుకను ఎరిగి, ఎరుకను మానుమని చెప్పిన దీక్షిత సిద్ధాంతాన్ని కండ్లకు కట్టినట్లుగా శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు చెప్పేవారు. గురుకటాక్షమున శేషజీవితము ఏభ్రాంతిలేక కతృత్వరహిత కర్మాచరణముచే జీవించుటయే శ్రేయస్కరమని బోధించిన అచలప్రబోధరత్న శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులకు ద్వాదశనమస్సుమాంజలులు.

మడికొండ

# అచలస్థితి

గీ॥ కదలకను యన్నదొక్కటి కదిలెదొకటి

గలవు సుమిరెండు రెంటిలో కదిలేదాన్ని

తప్పదీయుటే మాబోధ ధర్మమంచు

దెలిపినాడవు నిజబోధ దేశికేంద్రా!

శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగయార్యులు పూజావిధానములో తెలియజేసినారు:

పరిపూర్ణపరబ్రహ్మమొకటి, మాయాశబలబ్రహ్మము ఒకటిగలవు. అరెండింటిలో మిదధ్యయగు శబలబ్రహ్మమును తప్పదీయుటే మాబోధ ధర్మమని అచల సిద్ధాంత పరులు తెలియజేయుచున్నారు.

కారణములేనదే కార్యముండనట్లు మిథ్యయైన జగత్తులో అతి సూక్ష్మముగాన్ను బ్రహ్మము సత్యముకాదు.అదిమిథ్యఅయి తిరుగుతుంది. ఇక పరిపూర్ణమేతప్ప ఇతరమేమియులేదు.

పరిపూర్ణములో తోయబడిన బ్రహ్మమే మాయయును ఉపాధితోకూడినప్పుడు ఈశ్వరుడుగాను అవిధ్యయను ఉపాధితో కూడినప్పుడు జీవునిగా మారి సృష్టిచక్రములో జననమరణములను పొందుచున్నది.

జగత్తు సృష్టికి పూర్వములేదు,ప్రళయానంతరము ఉండదు.-ఈ మధ్యకాలమున మాత్రమే గోచరించును.కావున మిథ్య. దీనికి కారణమైనబ్రహ్మఉకూడా మిథ్యే. ఎందుకంటే పుట్టుక ఉన్నదే పుట్టించగలదు. పుట్టిని గిట్టగలదు. ఇక పరిపూర్ణము దేనిని పుట్టించదు, పుట్టదు. గిట్టించదు,గిట్టదు. అది ఎల్లవేళలందు, ఎల్లచోటులందు,ఒకే విధముగా నింఢి నిభిడీకృతముగాన్నది.

బోందిలో జీవమున్నప్పుడే,సద్గురుని ఆశ్రయించి, నిజమైన బధను తెలుకొని, గురుకటాక్షముచేత ఉన్న పరిపూర్ణమును ఉండజూచి, గుర్తెరిగిన దాని గుర్తువిడిచి విరాజిల్లువాడే అచలస్థితుడు.



**శ్రీమతి వాడపల్లి శైలజ**

ప్రథమ పుత్రిక

# నాన్నగారి బాట నడిచి, నా జీవితం పునీతం చేసుకుంటా

మా తాతగారు శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగయార్యులవారు, శ్రీ శివరామదీక్షిత పరంపరగురువులు. వారివలన ప్రేరేపితులైన మా నాన్నగారు శ్రీ నిత్యానంద వాడపల్లి అనందార్యులు తండ్రి మార్గమును అనుసరించి ఈ బోధలోకి వచ్చినారు. మానాన్న గారు బ్రతికి ఉన్నంతకాలం ఈ బోధలోని పరమార్థము, విలువను గ్రహించని అజ్ఞాను రాలినైనాను. ప్రాపంచిక విసయాలకు లోనై భ్రాంతిలో పడి వారు నడిచే వేదాంతమార్గం వైపు కన్నెత్తి చూడలేని అంధరాలిని. నాన్నగారు పరమపదించిన తరువాత వందలాది శిష్యులు,గురుభక్తులు దూరభారాలను లెక్కచేయకుండా వచ్చి, నాన్నగారి భౌతిక కాయాన్ని దర్శించుకున్నారు.గోడుగోడున విలపించినారు.రాత్రంతా జాగరణ,భజనలుచేసి, నాన్నగారియందు భక్తిని చాటినారు. ఆరోజు మానాన్నగారి ఆత్మ సందేశానుసారం 'జజనమరణ భ్రాంతి రహితమునకు పరమాత్మాతీతం ప్రతిపాదించే పరిపూర్ణమార్గమైన దీనిని అనుసరించి నా శేషజీవితాన్ని, నాతండ్రిగారి మార్గంలో నడవాలని నిర్ణయించుకున్నాను. మండలారాధనరోజున, అందరి ఆశీర్వాదాలతో యదార్థ బోధోపదేశిక దయానందస్వామి వద్ద ఉపదేశము పొంది, నాన్నగారి మార్గంలో నడిచి, నా జీవితం పునీతం చేసుకోవాలని నిశ్చయించుకున్నాను.



**శ్రీ పాలకుర్తి శ్రీనివాస్‌గౌడ్**

కోగిలవాయి

# నేనెవరు?

సీ॥ జన్మాస్తవృద్ధులు క్షయపరిణామ వినాశములు। షడ్విధ వికారములు అనాత్మ॥

ఘనబాల్యయవ్వన కౌమార వార్ధిక్యములు। జాగ్రదాది అవస్థలు అనాత్మ॥

కమనీయ మహదహంకార భూజలహుతాశన। సమీరాంతరిక్షములనాత్మ॥

త్రిగుణముల్ స్థూలాది దేహత్రయంబు। లన్నమయాది పంచకోశములనాత్మ॥

అంతరేంద్రియ బాహ్యేంద్రియములనాత్మ॥ దృశ్యరూపంబు శృతమును దృక్కనాత్మ॥

రమ్యగుణధామ భద్రాద్రిరామ పరుశురామ నరసింహదాస సంరక్షితాహ్వ॥

ఈ శరీరములో ఆత్మ అనాత్మలు రెండు ఏకముగానున్నవి. అత్మానాత్మ వివేకమువలన ఆత్మజ్ఞానాన్ని పొందడం ముఖ్యమైన విషయము. ఈ శరీరములోని అనాత్మను నేతినేతి ఇదికాదు ఇదికాదు అని తీసివేయగా శేషించనదే అత్మయగును. షడ్విధ వికారములు, బాల్యాది అవస్తలు, పంచభూతములు,గుణములు,కోశములు,అంతర, బహ్యేంద్రియములన్నీ అనాత్మే. ఇందులో ఏదీకూడా నేననే పదమునకు నిజమైన అర్థముకాదు,

నేను అనే పదానికి మిథ్యార్థము, గౌణార్థము, ముఖ్యార్థము అను మూడర్థములు ఉన్నవి.

## మిథ్యార్థము

సహజంగా నేను అనగానే స్థూలదేహమును ఆధారంగా నేను పొడుగ్గాఉన్నాను. నేను పొట్టిఎఉన్నాను, లావుగాను,బక్కగా ఉన్నాను, నేను పలానా కులంవాడను. నేను పురుషుడను, నేను స్త్రీని, అని శరీరపరంగా కనబడే శరీరమే ఈ నేనని అనే భావము కలుగుచున్నది. వేదాంత శాస్త్రములో దీనికి మిథ్యార్థము అని పేరు. వేదాంతములో ఇది నేననే పదానికి నిజమైనఅర్థంకాదు. అది కేవలము స్థూలంగా కనబడే ప్రపంచాన్ని మాత్రమే నేను అంటున్నాను ఇదిమిథ్యార్థము.

## గౌణార్థము

ఇక నేననే పదార్థములో ఇంకొకటి గౌణార్థము ఉన్నది. నేను ఏ జన్మలో ఏం పాపం చేసుకున్నానో ఈ జీవితంలో ఇలా అనుభవిస్తున్నాను. ఇప్పుడు చేసుకున్న పుణ్యపాపాలు ముందుజన్మలో అనుభవిస్తాను. ఈ కర్మలు నన్ను పట్టి పీడిస్తున్నాయి. నేను కర్మ చేయకుండా ఉండలేను. కర్మల వలన నాకు జన్మలు వస్తునే ఉంటాయి. ఈ రకంగా కర్మవాసనలను విచారిస్తూ జననమరణాలను పెంపుచేస్తాడో అవస్తువు నేననే బ్రహ్మము ఉన్నదే అదే గౌణార్థము. ఇదికూడా నేననే పదానికి సరియైన అర్థము కాదు. బుద్ధియందు కల్పించబడే సుఖద్దుఖాలు నాయి అనుకోవడం వలన ఆ పరిస్థితి ఏర్పడుచున్నది. కాబట్టి అంత్ఃకరణమైన మనసు,బుద్ధి, చిత్తము, అహంకారము చేసే పనులే నావి అనే అభిమానం తోటి నేను అనుకోవడం. ఇది నేననే పదానికి నిజమైన అర్థంకాదు.

## ముఖ్యార్థము

ఇక నేననగా ఎవరు? అనగా ఈ బాహ్యంలో ఉన్న స్థూల శరీరాన్ని ఎలా తెలుసుకున్నావో, ఈ లోపలి శరీరాన్నికూడా తెలుసు కుంటున్నాను. అట్లాగే బయటవుండే కోపతాపాలు ఎట్లా తెలుసుకున్నావో, నాలో పుట్టే గుణాలన్నింటినికూడా నేను, తెలుసు కుంటున్నాను. గుణములు నాకు తెలియబడు చున్నవి. కావున అవినాకు దృశ్యములు నేను దృక్కును. అనగా నేను గుణములను తెలుసుకునేటువంటి సత్తాస్వరూపమైన ఆత్మనే కాని, ఈ గుణాలు నేను కాదు. ఈ శరీరములో తెలుసుకునే ఆత్మ స్వరూపమే నేనుకాని, ఈ స్థూల శరీరము నేనుకాదు. ఎప్పుడైతే ఈ లోపల జరిగే సమస్తాన్ని, బయట జరిగే సమస్తాన్ని, తెలుసుకుటుంటున్నావో ఆ తెలివి నేనని భావిస్తున్నదో అది నేననే పదానికి ముఖ్యార్థము.

శరీరమే నేను అనుకోవడం మిథ్యార్థము. సుఖదుఖాదులను అనుభవించు జీవుడను నేననుకోవడం గౌణార్థము. అన్నింటికి సత్తానిచ్చే ఆత్మస్వరూపాన్ని నేనని తెలుసుకోవడం ముఖ్యార్థం. దీనినే త్వంపద దర్శనం అంటారు. ఈ విధంగా గురూపదేశం అయితే, శిష్యుడు ఎన్నో స్థానాలు దాటిపోతాడు. స్థూల, సూక్ష్మ, కారణశరీరాదులను దాటి, ఆ యొక్క ఉన్నత స్థాయికి చేరుతాడు. అందుకే గురూపదేశం అవసరం.



శివనగర్ బోధానంద గూడురు చెన్నస్వామి గారి మండలారాధన



చిన్నముప్పారంలో వేదాంత సభలో ప్రసంగిస్తున్న శ్రీ ఆనందార్యులు

యుక్తవయస్సులో
శ్రీ వాడవపల్లి ఆనందార్యులు





శ్రీ లలితాంబ సమేత
ఆనందార్యులు

శ్రీ ఆనందార్యులు
కుమారులు వివేకానంద్,
యోగానంద్





శ్రీ నిత్యానంద వాదపల్లి ఆనందార్యుల శిష్యబృందం రామంచ



బెంగుళూరులో వేదాంత మహాసభ




బెంగుళూరు లో నిత్యానంద బింగి రాజయ్యగారిని సన్మానిస్తు...




కార్వాన్‌లో శ్రీ భాగవత క్రిష్ణప్రభుమందిరములో శిక్షణ తరగతులు నిర్వహిస్తూ...



శివనగర్ వేదాంత సభలో

శాసనసభ్యులు గౌ॥శ్రీ బస్వరాజు సారయ్యగారిని సన్మానిస్తూ



1983లో నిజామాబాద్‌లోని అనాధాశ్రమ ప్రారంభోత్సవ సభలో

సమాఖ్య పితామహులు గంగరాజు గారితో..




గొల్లగూడెంలో బస్సుయాత్రా సందర్భంగా గురుపూజా కార్యక్రమం



శ్రీ చింతిరెడ్డి రాజిరెడ్డి గారి గృహంలో మండలారాధన



**సేకరణ శ్రీ బండ్యాల బస్వారెడ్డి**
జులైవాడ హన్మకొండ

## "జీవుడు అబద్ధమే, ఈశ్వరుడు అబద్ధమే, జగత్తు అబద్ధమే"

-శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందం

శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందంగారు ఏ సభలోనైనా ముఖ్యముగా చెప్పేది జియ్యరుస్వామిగారు జీవుడ, ఈశ్వరుడు, జగత్తు మూడు నిజమని అంటాడు. నేను ఈమూడు అబద్ధముఅంటున్నాను అని చెప్పవారు. కావున జీవేశ్వర విచారముచేసి అబద్ధమని నిరూపించుటే ముఖ్యోద్దేవము.

మాయ, మాయాధిష్టానము, మాయా ప్రతిబింబము కలిసి ఈశ్వరుడన్నారు.

అంతకరణము, అంత్ణకరణ అధిష్టానచేతనము, అంత్ణకరణ ప్రతిబింబము జీవుడన్నారు.

## జీవుడు

ఈ కలయిక లేకపోతే రెండూ ఉరికే ఉంటాయి. జ్ఞానమనోబుద్ధహంకారమనే అంత్ణకరణమునకు అధిష్టానముగా చేతనమైన పరమాత్మ ఉన్నది. ఆ పరమాత్మే ఈ అంతకరణమనే అద్దములో ప్రతిబింబిస్తున్నది. ప్రతిబింబించినప్పుడు చిద్జడగ్రంధి ఏర్పడుతుంది. చిత్తైనజ్ఞానము జడమైన శరీరము రెండు ఒకటిగా తయారై బయటకు వస్తాయి. సుషుప్తి అవస్థలో జడమైనశరీరము ఊరకనే పడి ఉంటుంది. ఈ కనబడే స్థూలశరీరము ఏమి పనిచేయలేదు. మనోబుద్ది చిత్తహంకారములు పనిచేయలేవు. అ సూక్ష్మరూపమైనటువంటి ఆ శరీరము, స్థూలమైనట్టి ఈ శరీరానికి సంయోగము ఏర్పడుతుంది. దీనినే చిత్ జడ గ్రంధి అంటారు. ఇదే అంతకరణమందు ఆత్మయొక్క సత్తా ప్రతిఫలించడం.

ఉదాహరణకు వైరు ఉన్నది, బల్బు ఉన్నది. రెండూ కాలిగనే ఉన్నవి. అధిష్టానమైన కరంటు స్విచ్‌లో ఉన్నది. స్విచ్ వేయగానే రెంటి సంయోగమువలన బల్బు వెలుగుతుంది. ఆ విధంగా అధిష్టాన చేతన బ్రహ్మము అంత్ణకరణమునందు ఎప్పుడు ప్రతిబింబిస్తుందో జడమైన శరీరానికి చేతనత్వం వస్తుంది. చేతనం వచ్చిన తరువాత సమస్తమైన కోరికలచేత ఇదంతా నాకు కావాలే, నేనే అనుభవించాలనే అజ్ఞానానికి లోనై, కామక్రోధలోభమోహమదమాత్సర్యాలు కల్పన చేసుకొని ధారేషణ, ధనేషణ, పుత్రేషణ అనే ఈషనత్రయములను

పాటించుకుంటూ రాత్రింబవల్లు ఎడతెరిపిలేకుండా కోర్కెలు కోరుతూ కష్టపడేదే జీవుడు. అంత్ణకరణముఅంత్ణకరణ అధిష్టాన చేతనము అంత్ణకరణములో ప్రతిఫలించి ఈ మూడింటిని ఏకం చేసేది పైకి లేచి అన్నింటికి కర్తృత్వము వహించి కర్తగా ఉంటున్నదో దానికి జీవుడని పేరు.

ప్రాణము జీవుడన్నా ప్రాణము జడపదార్థము. దానికి ఏమి తెలియదు. అది పడుకున్నప్పుగుఅన్ని శరీరాలలో ఊరకనే అడుతుంది. అది దేనిలోను కలువలేదు. ఇంకొక దానిని ఏమియును అనలేదు. తనమీద ఏదైనా పడినా తనకు తెలిదు. కావున జడమైన ప్రాణము జీవుడుగాదు. అట్టి జడమైన శరీరము జీవుడుకాదు. ప్రాణమును ఈ శరీరములో బంధించి అడిస్తూ కర్తృత్వము వహించే స్వరూపమేదో అదే జీవుడనే పదానికి అర్థము.

ఆత్మవైన నీవు అంత్ణకరణములో ప్రతిబింబించి, అంత్ణకరణ ధర్మాలైన సుఖద్ణఖాలు నావేనని భ్రమించే అవస్థకు జీవుడని పేరు.

## ఈశ్వరుడు

ఇక మాయ అధిష్టానచేతనముగానుండి మాయమందు ప్రతిఫలించి ప్రపంచమును ఉత్పత్తిచేసే శక్తి ఒకటుంటుంది. అది ఈశ్వరుడనే పేరు. వాస్తవంగాచూస్తే జీవేశ్వరులు రెండూ ప్రతిబింబాలే. మాయయందు ప్రతిఫలించిన పరమాత్మచేతనానికి జీవత్వము అంటారు. అందువలన అధిష్టానచేతనముగా ఉండేటువంటి ఆత్మ స్వరూపాన్ని ఎప్పుడు తనలో తాను మరిచిందో, అప్పుడు మాయను స్వాధీనము చేసుకొని దాని సర్వజ్ఞత్వాది గుణాన్ని ప్రేరేపిస్తుంది. అంటే సర్వసృష్టత్వం, సర్వపాలకత్వం, సర్వకర్తృత్వం, సర్వవ్యాపకత్వం, సర్వాంతర్యామిత్వం, సర్వసంహారకత్వం అనే షడ్గుణములచేత ఈశ్వర సత్తాతో పనిచేస్తుంది. అక్కడ ఎట్లావుంది నీ స్వరూపమంటే మాయయందు ప్రతిపలించిన సత్తా, అందుకు మాయను, అవిద్యను తీసివేస్తే జీవుడు ఈశ్వరుడు అను వస్తువులు ఇక ఉండవు. అదిష్టానచేతనమైన నీయొక్క స్వరూపమూ ఉంటుంది. ఇప్పుడు జీవుడనని అనేవాడే వేదాంతం నేర్చుకొని ఈశ్వరుడని అంటున్నాడు. జీవోహం అనేవాడే శివోహం అంటాడు. నేను జీవుడనని భ్రమించేవాడే అ యొక్క స్వరూపాన్ని తెలుసుకున్నాక శివోహం అంటాడు. జీవోహం అంటే ఒక శరీరం లో మాత్రమే బంధమేర్పడినది. శివోహం అంటే సృష్టిలోనున్న 84లక్షల జీవరాసులతో బంధమేర్పడుతుంది. అందుకే జీవుడను నేనన్నప్పుడు ఒక శరీర జననమరణాలే ఉన్నాయి. కాని ఈశ్వరుడు నేనన్నప్పుడు సృష్టిమొత్తం జననమరణాలు నాకే ఉంటాయి. జీవేశ్వరుల స్థానములు రెంటిని కూడా అధిగమించి పోతేనేగాని, జననమరణాలు తొలగిపోతాయి. లేకపోతే తోలగిపోవు అని చెప్పి ఈ జీవేశ్వరులయొక్క మిధ్యా స్వరూపముని విచారించినారు.

జీవుడనేవాడు వాస్తవముగాలేడు. జాగ్రత, స్వప్న, సుషుప్తులనే మూడవస్తలు. స్థూల, సూక్ష్మ,కారణములనే మూడు శరీరములు. విశ్వ, తైజస, ప్రాజ్ఞులనే ముగ్గురు అభిమానులు. ఈ సమూహముకలిసి కర్తృత్వ, భోక్తృత్వ, అహంకారములు కలిగి, జాగ్రతలోనూ, స్వప్నంలోనూ, సుషుప్తిలోనూ నేనే కర్తను. నేనే జీవిస్తున్నాను. నేనే ఉన్నటువంటి ఈ తొమ్మిది కలిస్తే జీవుడైనాడు. కాని ఈ విధముగా జీవునకు జాగ్రత, స్వప్న, సుషుప్తులను మూడవస్థలేకాని, వాస్తవమై స్వరూపాలుకావు. అంటే స్థూల, సూక్ష్మ, కారణశరీరములు మూడవస్థలు అనుభవించుభోగసామాగ్రియేకాని తానుకాదు.

కం॥ యెరుగదు సుప్తిని జాగ్రత। నిరవొంద సుషుప్తిని రెంటినెరుగును మేల్కొ ట్లరయగ బయలెరుకల రెంట్నెరుగదు బయలెరుక। రెంటి నెరుగూచునుండూ॥ గురు ముఖమూన నరిగీయారెండూ॥ తిరమూగా యెరుకాను తీసివేసితెజాలు। పరులు నేననియేటి పలుకే లేకుండునిట్లె రుగూచునుండూ॥ గురుముఖమూన నరిగీ యారెండూ॥

ఇది ఎట్లా ఉందంటే నేను జీవుడనన్నప్పుడు ఏ అవస్థకు ఆ అవస్తే అర్థంచేసుకున్నాము కానినీవు ఈశ్వరుడవైనప్పుడు ఈ మూడవస్తలను నీవే తెలుసుకునే వాడివి అయినావు. ఇప్పుడు నాకు స్వప్నంవచ్చి పోతుంది. జాగ్రత, సుషుప్తులు వచ్చిపోతాయి. ఈ ముడవస్థలలో ఏ వస్తువైతే ఈ అవస్థలను గుర్తు పడుతుందో ఆ వస్తువే నేను. జాగ్రత నిద్రను, నిద్ర జాగ్రతను తెలియలేవు. అందులో జాగ్రతలో నిద్రావస్థ, నిద్రావస్థలో జాగ్రదావస్థ లేవు. ఇవి రెండు భిన్నధృవాలు. ఇవి తెలుసుకోవు. అందువల్ల నీ స్వరూపం ఎట్లా ఉన్నదంటే ఈ రెంటిని తెలుసుకునే పదార్థ నీవై ఉన్నావు. జాగ్రతలో జాగ్రతను, జాగ్రతలో స్వప్నమును, జాగ్రతలో సుషుప్తిని మూటిని తెలుసుకుంటూ మూటికి నిదర్శనమై ఉన్నదేదో ఆవస్తువు నేననేటువంటి జ్ఞానము ఎప్పుడు కలుగుతుందో, నీవు అఖండఎరుక రూపుడవైతావు. అఖండం అంటే అన్ని అవస్థలలో తానే ఉన్నాడు. తెంపు ఉండదు. కాబట్టి ఆ ఎరుకయొక్క స్వరూపాన్ని తెలుసుకోకుండా అవస్థలనే చెప్పుకుంటూ ఏ అవస్థ వచ్చినప్పుడు, ఆ అవస్థనే సత్యమని నమ్ముకుంటూ పోతే, వానికి ఎప్పటికీ అఖండమైన ఎరుకతత్వం రాదు. అఖండ ఎరుకంటే నీవు ఖండాఖండములుగా కనబడినా వాటి అన్నింటిలో నిలిచే వస్తువు నీవు కావాలి. అప్పుడు అఖండ ఎరుకతత్వం సిద్ధిస్తుంది.

అట్లాగే విరాట్, హిరణ్యగర్భ, అవ్యాకృతములనే మూడు ఈశ్వర తనువులు కలవు. సమిష్టి జాగ్రత, సమిష్టి స్వప్నం, సమిష్టి సుషుప్తి అనేటువంటి మూడు ఈశ్వరుని అవస్థలు. సృష్టి స్థితి, లయములు ఆయనకు కర్తృత్వములు. ఇవన్నీ కలిపితే ఈశ్వరుడైనాడు. పోనీ ఇవన్నీ ఒకదానిని ఒకటి తెలుసుకోలేవు. ఆకాశం వాయువును, వాయువు ఆకాశాన్ని తెలుసుకోలేవు. స్వతఃసిద్ధమైన జ్ఞానము వాటికి లేదు. అంటే వైరుధ్యమైన స్థానాలలో వాటికి సత్తానిచ్చి

వాటితో పనిచేయించే శక్తియే ఆత్మ. అదే పరమాత్మయొక్క స్వరూపము. ఆ పరమాత్మయొక్క స్వరూపము నేనైనప్పుడే అదేనేనని భావించినప్పుడు ఆ స్థానము ధృడముగా నమ్మినప్పుడు

శ్లో॥ మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం ।

మయి సర్వం లయంయాతి యోతత్ బ్రహ్మ.....

నాయందే సర్వము సృష్టిస్తావున్నది నాయందే సర్వము ఉంటూ ఉన్నది.నాయందే సర్వము లయము అవుతున్నది. ఇట్లు అంతర్బాహ్యములలో కలిగినటువంటి ఈ జగత్తు ఉత్పత్తి స్థితి లయములకు మూలకారణమైనటువంటి ఏకైక రూపము నేనే. నేనే అద్వయ బ్రహ్మము.అన్నింటిలో నేను ఒక్కడనే ఉన్నాను. అప్పుడు అఖండత్వము అవుతుంది. దీనినే అఖండ ఎరుకగా ప్రతిపాదన చేసినారు.

కం॥ పిండ బ్రహాండంబులు ।రెండును యారెంటిలోని రెండహములు యీ। ఖండములు నాల్గుగూడి య।ఖండంబగు యెరుకరూపు గనరా మాతండ్రీ॥ యిది దేల్పిన ఘనుడే తల్లిదండ్రీ॥ ఖండాఖండములూగ గనిపించె యెరుకానె। దండీదనెటి యుద్దండూల కలనైన గనరా మాతండ్రీ॥యిది దేల్పిన ఘనుడే తల్లిదండ్రీ॥

పంచభూతములతో కూడుకొని జాగ్రత, స్వప్న, సుషుప్తాది అవస్థలు నిరంతరము సుఖదుఖాలను అనుభవించేది పిండాండం. ప్రత్యక్షముగా అనుభవములో ఉన్నది. అట్లే ఎరుకశరీరానాకి పంచభూతములు శరీరాకారములుగా ఉన్నవి. అందుకు కృష్ణప్రభువు

కం॥ యెరుకైన భూతముల నీ।వెరుగుము ఆకసము గాడ్పు యింగలమును నీ।

ళ్ళీరవంద నేలయని నే।నెరిగిన పద్ధతి నీకు నెరిగించినానూ॥

ముజ్జగమూలయ్యేను వీట్లతోనూ॥ పరిపూర్ణమందు కన్పడుచు తమకుదామె।

మరికాన రావిట్టి మార్గము కలవీటి నెరిగించినానూ॥ముజ్జగమూలయ్యేను వీట్లతోనూ॥

ఎరుకను బ్రహ్మాండములో, ఆకాశము శిరస్సుగాను, వాయువు గళంగాను, అగ్ని నాభిగాను, జలము కటిప్రదేశముగాను, భూమి పాదములుగాను విరాట్ స్వరూపముగానున్నది. మిరు ఈవిరాట్ స్వరూపము ఈ జీవుడుండూటువంటి పిండాండము ఎవరికి తెలియబడుచున్నవి.ఆ విరాట్ స్వరూపం దీనిని తెలియలేదు ఈ

పంచకోశాలు తెలుసుకోలేవు. ఇక్కడ అక్కడ గుర్తెరిగేది ఇదే. నేననే పదార్థమే తెలుస్తున్నది. జీవుడంటే ఎట్లా ఏర్పడినాడు. ఈశ్వరుడు ఎట్లా ఏర్పడినాడు. అనే విశయం పరిపూర్ణబోధలో మాత్రం నేననే పదార్థం అఖండ ఎరుకగానే రెండింటిలో ఎర్పడినది.

కాని సుఖదుఖాలు అనుభవించే జీవుడు కించజ్ఞాత్వాది గుణములచే వేరుగా ఉంటాడని మనకు తత్వమసి వాక్యము తెలుపుచున్నది. జీవగుణములుపోయి ఈశ్వరగుణములు అలవడే వరకు జీవత్వానికి మోక్షం లేదు. నేను రాగిని నేను భోగిని, నేను కామక్రోధాదులచే పీడింపబడుచున్నాను. నాలో ఆశాపాశ గుణములచేత నేను పీడింపబడుచున్నాను. ఈ కోపతాపదురహంకారముచేత బాధపడుచున్నాను. ఈ గుణములన్నీ నాలోనుండి తొలగిపోయి అఖండమైన పరమాత్మ స్వరూపముగా అయ్యేవరకు జీవుడు ఈశ్వరుడు కాడు. ఈ కించజ్ఞత్వాది గుణములుపోయి సర్వజ్ఞత్వాది గుణములు కలిగినప్పుడే జీవుడు ఈశ్వరుడు అయితాడు కాని అంత వరకు ఒట్టి మాటలచేత జీవుడు ఈశ్వరుడు ఐనాడంటే ఒప్పమని అన్నారు అద్వైతులు. లేదంటే వాచావేదాంతమే అవుతుంది. కాబట్టి ఈ విధంగా జీవేశ్వర విచారణ చేసినప్పుడుదాని యొక్క పర్యవసానం తెలుస్తుంది.

అందుకు పరిపూర్ణబోధ అవసరమైనది. తాను అఖండ ఎరుకగా అయినప్పుడు నాకన్నా అన్యమైన పదార్థము ఒక్క అణువుకూడా లేదని తోచి నప్పుడు, అట్టి పరిపూర్ణ వస్తువులో, తనయొక్క ఉనికిని విచారించడం సిద్ధాంతము.

నీస్వరూపము నీవు మరిచిపోవటం వలన జీవుడనని, అనేక జనమరణాలను అనుభవిస్తున్నాననే భ్రమ నీకు కలిగింది. అదే స్వరూపాన్ని కనుక గురువు జ్ఞాపకము చేస్తే అయ్యా నాయందు ఇలా అనంత కోటి జన్మలు వచ్చిపోతున్నవి అన్నావుకదా నేనెందుకు నేనే పుడుతున్నాను చస్తున్నాను అని నేనేందుకు అనుకుంటాను. మన కలలో ఎన్ని శరీరాలు క్రొత్తక్రొతవి వస్తుంటాయి. అన్ని శరీరాలు ఉన్నట్టుండి లేకుండా పోతాయి. వాస్తవానికి నేననే పదార్థములో ఈ జనన మరణాలనేవి, మరియు జీవేశ్వరులనేవి కేవలం కల్పితాలే.

కం॥ ఎరుకన మరుపనరానిది పరిపూర్ణంబు, ఈశ్వరుడనబడున్ ఎరుక,

ఎరుకమరచిన జీవుండనబడున్, ఎరుక అచలమునెరగ అరుగున్, ఎరుక మరుపులన్॥



శివనగర్ వేదాంత సభలో

శాసనసభ్యులు గౌ॥శ్రీ బస్వరాజు సారయ్యగారిని సన్మానిస్తూ



**1983**లో నిజామాబాద్‌లోని ఆనాధాశ్రమ ప్రారంభోత్సవ సభలో

సమాఖ్య పితామహులు గంగరాజు గారితో..




గొల్లగూడెంలో బస్సుయాత్రా సందర్భంగా గురుపూజా కార్యక్రమం



శ్రీ చింతిరెడ్డి రాజిరెడ్డి గారి గృహంలో మండలారాధన

## శ్రీమదచలగురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య

శ్రీమత్ అచలగురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య ఇందులో శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమము అనే సమాసాన్ని మొదట శ్రీ కడవేటి నర్సారెడ్డిగారు అభినవ దీక్షితీయ ఉపాసనాకాండ అను గ్రంథములో ప్రయోగించినారు.

శ్రీమదభినవ దీక్షితీయే ఉపాసనాకాణ్డ వేదాంతసరస్వతి బిరుదాంకితేన నరసారెడ్యాఖ్యేన విదుషా విరచిత సికింద్రాబాదు పుర్యాం శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ వాస్తవ్యై శ్రీమద్దయానంద రాజయోగి వర్యై ప్రకాశిత్త (15-8-1955) అని ఉన్నది.

శ్రీమత్, అచలగురుపీఠము మరియు రాజయోగాశ్రమము అనే మూడు పదాలు మనకు సుపరితమైనవే.ఇక నాల్గవ పదము సేవా సమాఖ్య.ఇందులోనూ సేవ అంటే సుశ్రూష అనిఅర్థం.

సమాఖ్య అను పదమునకు అంగ్లములో ఫెడరేషన్ అని అర్థము. దీనికి అమెరికా సంయుక్త రాష్ట్రాలే మంచి ఉదాహరణ. రాష్ట్రాలన్ని స్వతంత్ర ప్రతిపత్తి కలిగిఉండి, వాటి ఉమ్మడి ప్రయోజనాలైన రక్షణ,విదేశీ వ్యవహారం, రవాణా మొదలగు శాస్త్ర సాంకేతిక రంగాల కోసం రాష్ట్రాల ప్రతినిధులచే ఏర్పడిన కేంద్రమని అర్థము. పైన నిర్దేశించిన లక్ష్యాలలోతప్ప, కేంద్రానికి రాష్ట్రాల అంతర్గత విషయాలపై ఏవిధమైన అధికారాలు ఉండవు. మన దేశాన్ని ఖాసీ ఫేడరల్ అంటారు. అనగా మన దేశంలో రాష్ట్రాలకన్నా కేంద్రమే బలమైనది.

సేవా సమాఖ్య అంటే సమైక్యమనికాదు. సమైక్యమంటే పూర్తిగా ఒకదానిలో ఒకటి కలిసిపోవడం. సమాఖ్యలో కలుపుకోవడాలు ఉండవు. కేవలం కొన్ని విషయాలలో మాత్రమే కలిసి పనిచేయటం ఉంటుంది. ఉదాహరణకు కొన్ని శాఖలు, బలంగాను, మరికొన్ని శాఖలు బలహీనంగాను చిన్నవిగా ఉంటారు. బలమైన శాఖలు బలహీనమైన శాఖలను ఇబ్బందులకు గురిచేసి వాటిని తమలో కలుపుకుంటాయి. అదే విధముగా గురువులు. గరువులు లేనివారు. అహంరహితమని చెబుతూనే పీఠాధిపత్యం కొరకు ప్రయత్నించేవారు ఉంటారు.

శాస్త్రమునకు అంతులేదు. శిక్ష, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, కల్పము, జ్యోతిష్యము అనేవి విద్యాంగములు. సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంసఅనేవి ఉపాంగములు. మానవుడు తనజీవితకాలలో వీటిని పూర్తిగా అధ్యయనము చేయలేడు.

ఉదాహరణకు అచలబోధలో ఆత్మనుండి సృష్టి అయింది అని చెబుతారు. అద్వైతులు అవ్యక్తమను మాయనుండి సృష్టి జరిగింది అంటారు. విశిష్టాద్వైతులు శ్రీమన్నారాయణుడు అంటారు. సాంఖ్యులు, యోగులు ప్రకృతియని,

న్యాయ వైశేషికులు నవవిధ ద్రవ్యములని, పూర్వమీమాంసకులు కర్మయని, ఉత్తర మీమాంసకులు ఆత్మవలన సృష్టి జరిగిందని నమ్ముతారు. ఇవి సరిగా తెలియని కొందరు జడమైన నవవిధ ద్రవ్యముల వలన సృష్టి జరిగిందని అసాంప్రదాయ మాటలు మాట్లాడి సాంప్రదాయాన్ని కలుషితం చేస్తారు. ఇలాంటి కల్లబల్లి మాటలను నమ్మిమోస పోకుండా అనుభవజ్ఞులైన పెద్దలు సమాఖ్య భావముతో తెలియజేస్తారు.

సేవా సమాఖ్యలో మరో ముఖ్యవిషయము 'అనుబంధపీఠము'. గతంలో శ్రీదయానంద పొన్నాల రాజయోగిశాఖలోని పీఠాలకు ఉపపీఠాలని పేరు. వాటికి పీఠాధిపతి శ్రీదయానంద పొన్నాల రాజయోగి. ప్రస్తుతము వారి కుమారుడు పీఠాధిపతి. పీఠాధిపతికి తెలియకుండా ఉపపీఠాలు ఏ కార్యములు చేయుటకును వీలులేదు. తప్పనిసరి పీఠధిపతి అనుమతితో మాత్రమే చెయ్యాలి. ఎవరికైనా బోధాధికారము ఇవ్వాలన్నా పీఠాధిపతే ఇవ్వాలి. కాని అనుబంధ పీఠములు అలా కాదు. తను స్వేచ్ఛగా కార్యములు చేసుకోవచ్చు. సాంప్రదాయంలో ఏవైనా మార్పులు చేయాలనుకుంటే అనుబంధ పీఠముల పీఠాధిపతులు అందరు సమావేశమై విషయాల్ను కూలంకషంగా చర్చించి మెజారిటి ఆమోదము మేరకు తీర్మానాలు చేయబడుతాయి. అట్టి తీర్మాణాలను అందరు గౌరవిస్తారు.

అనుబంధపీఠాల అస్తిపాస్థులు ఆ పీఠ కార్యవర్గమునకే పూర్తి అధికారము కలిగి ఉంటుంది. ఎవరైన వ్యక్తులుగాని, సంస్థలుగాని నష్టపరుచాలని చూచినప్పుడు సేవా సమాఖ్య కార్యవర్గము స్పందించి వారికి కావలసిన సంఘపరమైన, చట్టపరమైన సహాయాన్ని అందిస్తుంది.

ఇక 'వైజ్ఞానిక వేదాంత సభ' స్వానుభవముతో కూడిన జ్ఞానానికి విజ్ఞానమని పేరు. ఉపనిషత్తులు వాటికవి చెప్పుకుంటూ పోతాయి కాని అనుభవము ఉండదు. ఉపనిషత్తులు నేనే బ్రహ్మమును అని ప్రతిపాధిస్తాయి. నిరాకార, నిర్గుణబ్రహ్మమైన నాలో ఇన్ని కల్పనలు ఏలా జరుగుచున్నవి అనేదానికి సమాధానము చెప్పవు. ఏకమేవా2ద్వితీయం, సర్వంఖల్విదంబ్రహ్మ అనేపదాలకు, అజమ్, అమృతం,అవినాశినం, అచలంలాంటి పదాలకు సరియైన నిర్వచనాలు అనుభజ్ఞులైన గురువులే చెప్పాలి. ఆ పని అచలఋషులు ఎప్పుడో చేశారు. చావుపుట్టుకలు లేని శాశ్వమైన దానిని బయలుగాను, చావుపుట్టుకలుగల దాన్ని ఎరుకగా నిర్ణయించినారు. కాబట్టి అచలబోధ సభలు సాధారణ వేదాంతసభలుకావు. వేదాంతములో సరిగా చెప్పని విషయాన్ని చక్కగా గురువులు స్వానుభవముతో చెప్పేవి కాబట్టి వైజ్ఞానిక వేదాంత సభలని పేరు.

## సేవా సమాఖ్య మొదటి సభ

అది శ్రావణమాసం సోమవారం సాయంత్రము నాలుగు గంటల సమయము(1-9-1980) బయట అప్పుడే ఒక మోస్తరు వర్షం పడి వేలిచింది,అయినా తుంపరలు జాలువారుచునే యున్నది. భక్తానంద ఆశ్రమము

శివనగరం దక్షిణంవైపు టెంటుకింద టేబులు ముందునిలబడి నలభైయైదు సంవత్సరముల వయస్సుగల సన్నని వ్యక్తి మాట్లాడు చున్నాడు.

" సామాన్య మానవునికి ఈ బోధలు అర్థంకావు. వాళ్ళు నిరంతరము కూడు, గూడు, గుడ్డకొరకే అలోచిస్తారు. మనంచెప్పే బోధలు రుచించవు. మనంచేసే సేవలు ఆకర్షిస్తాయి. 'మమాత్మా సర్వభూతాత్మా'గాభావించే మనం గురుసేవలో భాగంగా సమాజసేవ చెయ్యాలి. అది ఎలా ఉండాలంటే కూడు, గూడు, గుడ్డకై శ్రమించే వారిని త్రివర్గమునుదాటి, అపవర్గమైన మోక్షమార్గంవైపు నడిపించేదిగా ఉండాలి. మానవులు కుల, మత, జాతి, లింగములను మరిచిపోయి సర్వమానవ సౌభ్రాతృత్వముగా జీవించేలా ఉండాలి. అది విద్యద్వారానే సాధ్యం కాబట్టి మనం నిరక్షరాస్యులను, అక్షర స్వరూపులుగా చేయాలి. అందుకోసం పాఠశాలలు, వైద్యశాలలు, వృద్ధాశ్రమాలు, అనాథాశ్రమాలు నెలకొల్పాలి. అనాథ పిల్లలను దత్తతతీసుకొని వారికి విద్యాబుద్ధులు నేర్పించాలి.....ఇలా మాట్లాడుచుండగా అదిపోరుగడ్డ, విప్లవాలపురిటిగడ్డ కావటంవల్లనేమో అమాటల్లోనుండి విస్ఫులింగాలు బయలదేరి, ఒక్కొక్కరిని అంటుకుని సభా ప్రాంగనమంతా దావానలంగా మారింది. అదిచూచి భీతిల్లిన వరుణుడు జారుకున్నాడు. హెూరుగా వీచిన మాతరీషుడు ముడుచుకున్నాడు. ఆ గంభీర సమయంలో వైశ్వానరునివలెఉన్న 25 సంవత్సరాల వయస్సుగల యువకుడు లేచి 'మీస్ఫూర్తితో నేను శ్రీమద్భాగవత క్రిష్ణప్రభు వయోజన విద్యా కేంద్రాన్ని ములుగు తాలుకా వెంకటాపురంలో ఏర్పాటు చేస్తా'నని ప్రకటించాడు. అది విన్న ఒక రైతులేచి 'శ్రీ భక్తానంద వయోజన విద్యావికాస కేంద్రాన్ని నరుసాపురంలో నిర్వహిస్తానని ప్రకటించినారు. అప్పటి వరకు ఖద్దరు దుస్తులు ధరించి రాజగురువువలె వేదికపై అసీనులైన వ్యక్తిలేచి 'నేను నిజామాబాదులో అనాథ ఆశ్రమమును నెలకొల్పుతానని వెల్లడించినారు. వేదికపైనే ఆసీనులైన మరోవ్యక్తి, చూడటానికి ధనవంతునిలా ఉన్నాడు. అతడు టక్కునలేచి కుడిజేబులో చేయిపెట్టి వందరూపాయల ఒకమడతను తీసి, ఎడమజేబులోచెయ్యిపెట్టి మరో వందరూపాయల మడతనుతీసి రెండింటిని టేబులుపై పెట్టి ఈధనముతో మంచి పుస్తకాన్ని అచ్చు వేయించండి అని కూర్చునాడు. అందరూలేచి శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య వర్థిల్లాలి! వర్థిల్లాలి!! వర్థిల్లాలి!!! అంటు ముమ్మారు దశదిశలు వ్యాపించేలా జేజేలు కొట్టారు.అలా మొదలైయింది సేవా సమాఖ్య మొదటి సభ.

ఆ సభకు అధ్యక్షతవహించి ధర్మాన్ని బోధించిన వ్యక్తే శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు, ఆ యువకుడే మన తంగళ్ళపల్లి రాజేంద్రుడు, ఆరైతే శ్రీఅచలానంద కూన లచ్చన్నగారు, ఆ రాజగురువే దయానంద గోనె రాజయ్యగారు. ఆ ధనవంతుడే శ్రీబండారు సత్తయ్యగౌడుగారు. అనాటి స్ఫూర్తి నేటి వరకు కొనసాగుతునేవుంది, దినదినము వర్థిల్లుచునేయున్నది.

# నిత్యానంద శ్రీవాడపల్లి ఆనందార్యుల సంగ్రహ జీవిత చరిత్ర

అచలబోధ సంప్రదాయంచరిత్రలో సత్చిదానంద పగడాల వెంకటేశ్వర అవధూతగారిది విశిష్టస్థానం. వారు రాష్ట్రం నలుమూలల పర్యటించి అనేక ప్రాంతాలలో ఆశ్రమాలను ఏర్పాటు చేసినారు. వారి శిష్యులలో ఒకరైన శ్రీనిర్మలానంద నేతివెంకయ్యగారు వరంగల్ నివాసి. వీరి శిష్యులే శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగయ్యగారు. శిష్యుడు అయ్యాక తనపేరును ఆగదాసుగా మలుచుకున్నారు. అచలబోధలో వీరిస్థానం ఉత్కృష్టమైనది. నైజాం రాష్ట్రం, మహారాష్ట్రం రెండింటిలోనూ విస్తృతంగా పర్యటించి, తెలుగు బోధను మహారాష్ట్రలో మొట్టమొదట ప్రచారంచేసిన వారు ఆగయార్యులే. నాందేడ్, గుల్బర్గ, భీవండి,ముంబాయి, పూనా, అహ్మద్‌నగర్, షోలాపూర్ మొదలగు ప్రాంతాలలో అనేక మంది శిష్యులు కలరు.

శ్రీ పూర్ణానంద వాడపల్లి ఆగయ్యగారి రచనలు. 1.పరిపూర్ణబోధ మార్గదర్శిని. 2.వేదాంత బాలబోధిని. 3.వెంటేశ శతకము 4.శ్రీమద్భాగవత కృష్ణప్రభు కందార్థములకు బావార్థములు 5. మేరువంశ పురాణము ప్రధానమైనవి. ఆగయ్యగారు తన 48వ ఏటనే పరమపదించినారు.

సాధారణముగా మానవులకు శరీరధర్మాలైన త్రివర్గములు అనగా ధర్మము, అర్థము, కామము మాత్రమే వారి జీవిత చరిత్రలో కనబడుతాయి. ధర్మము అనగా తల్లిదండ్రి, ఇల్లు ఇల్లాలు, అర్థము అనగా విద్యార్హతలు, స్థిర,చర ఆస్తులు. కామమంటే సంతానము. ఆత్మధర్మమైన మోక్షమునకు సంబంధించిఅంతగా కనబడవు. కారణం ఇది అంతర్గతమైన విషయం కాబట్టి. ఒకవేళ కనబడినా బాహ్యాచారమైన,జపతపాలు, పూజలు పుణస్కారాలు తప్ప భావనను గుర్తించలేము.అందుకే పూర్వము విద్యాభ్యాస సమయములోనే చతుర్విధ పుషార్థాలను లక్ష్యముగా చేసుకొని, అ కు 'అమ్మ' అని ధర్మానికి, ఆ కు 'ఆవు' అని అర్థానికి, ఇ కి 'ఇల్లు' కామానికి, ఈ కి 'ఈశ్వరుడు' మోక్షానికి ప్రతీకలుగా చెప్పేవారు.

వాస్తవానికి అచలగురువుల జీవ విధానాన్ని,ఆచరణను చూడాలంటే అది అచలులకు మాత్రమేసాధ్యం. ఈ భావం తెలియని వారికి సాధారణ మావులు ఎలా ఉదయంలేచి, కాలకృత్య,స్నానసంధ్యలు ముగించుకొని, తిని, పనిలోకి వెళ్ళి,సాయంత్రం ఇంటికి చేరుకొని భార్యాపిల్లలో కాలక్షేపంచేసి, అప్పడప్పుడు సినిమాలు, షికార్లుచేసి నిద్రలోకి జారుకోవడం. ఇది దినచర్య.

అచలగురువుల దినచర్యకుడా సాధారణ మానవులవలె ఉండబడినా, భావములో కర్తృత్వ, బోక్తృత్వ రహితంగా ఉంటుంది. అందుకే శ్రీశివరామదీక్షితుల వారి భావాన్ని తెలియాలంటే గురువు వెంట ఉండి ప్రతి విషయాన్ని గమనించమని చెప్పినారు. నడుస్తున్నప్పుడు, వ్యహారంచేస్తున్నప్పుడు, అన్నంతింటున్నప్పుడు, చివరికి పడుకున్నప్పుడు ఎలా భ్రాంతి రహితంగా ఉన్నది తెలుసుకోవాలి.

కం॥ ఇంగతమెరిగి సద్గురు : పుంగవుచే నరుడు భుక్తిముక్తి క్రియలన్।

సంగాసంగము లెడలిన। శృంగారమె వాని చేష్ట చూచె వారలకూ॥

వాడున్నట్లు తోచెవారలకూ॥

మంగళ సూత్రమేభంగి శృంగారమొ। శృంగారవతికి యశృంగారవతికట్లు చూచె వారలకూ॥

కం॥ యెరుకను విడనాడినయా। పురుషుని స్థితి యెట్టిదనిన పొందుగవినుమీ।

సరిపడు సరిసడదనుకన్। సరిగా వర్తింపుచుండూ సమరాసబుద్దిన్ ॥

కార్యములందు సహజాప్రవృద్ధిన్॥ పరిపరివిధములపరువులు పెట్టాడు।

మరి వైరాగ్యముచేత మానుకొనుండాడు॥

ఈ లాంటి స్థితిపురుషుల గురించి లౌకిక జీవితమేకాని, అశరీర విధానాన్ని వ్రాయలేము. ఇక శరీరానిదా జాయతే(పుట్టడం), అస్తి(జీవించియుండటం), వర్ధతే(పెరగటం), పరిణతే(మార్పుచెందటం),అపక్షీయతే(క్షీణించడం) వినశ్యతే(మరణించడం) అనేవి శరీరధర్మాలు. అందుకే అచలగురువులు జీవితచరిత్రలకు అంత ప్రాధాన్యతనివ్వరు.

శ్రీ వాడపల్లి ఆగయార్యులు వరంగల్ పట్టణములోని ఎల్లమ్మబజారులో నిశించేవారు. వీరి ధర్మపత్ని రత్నమాల. వీరికి జ్ఞాన పుత్రులు ఎంత అత్యధికంగా ఉన్నారో, కర్మపుత్రులు కూడా అలాగే ఉన్నారు. ఆగయార్య,రత్నమాంబలకు కలిగిన సంతానము పదముగ్గురిలో, ఏడుగురు మాత్రమే మిగిలినారు. 1) ఆనందం, 2) సదానందం, 3) దయానందం, 4) కరుణానందం అను నలుగురు మగవారు, 1) అనసూయ 2) అనంతలక్ష్మి 3) శేషమాంబ అను ముగ్గురు ఆడపిల్లలు. వీరిలో ప్రధమ సంతానమైన వాడపల్లి ఆనందంగారే మన కథానాయకుడు.

శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందంగారు 09-09-1935 లో జన్మించినారు. శ్రీ శనిగరం భార్గవి భద్రయ్యగారల కూతురు లలితగారితో 07 మార్చి 1953న వివాహము జరిగినది. పోష్టాఫీసులో ఉద్యోగం చేసి,ఎన్నో పదోన్నతులను పొంది, ప్రజల మన్ననలతో పనిచేసి 1994లో ఉద్యోగ విరమణ చేసినారు.

తన మీద ఆధార పడిన తమ్ముళ్ళకు, చెల్లెండ్లకు విద్యాబుద్దులు చెప్పించి వివాహాలు చేయటవలన సంతానము కొంత ఆలస్యమైనా, సంతానములోకూడా వీరు సంపన్నులే. వీరికి ఇద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు.

1. శ్రీమతి వాడపల్లి శైలజ.

2. శ్రీ వాడపల్లి వివేకానంద్ వీరి ధర్మపత్ని శ్రీమతి లతాలాస్యప్రియగారు, కుమారుడు పృధ్వీఆనంద్.

3. శ్రీ వాడపల్లి యోగానంద్. వీరి ధర్మపత్ని శ్రీమతి భావనగారు, కూతురు లిఖిత.

4. శ్రీమతి వాడపల్లి నీరజ. వీరి భర్త శ్రీ గట్ల సురేందర్ గారు, కుమార్తెలు నేత్ర, మిత్ర.

5. శ్రీమతి వాడపల్లి హిమజ. వీరి భర్త శ్రీ ఏపూరి సీతారామరావుగారు. కుమారుడు భాస్వంత్.

శ్రీ ఆనందార్యుల కుటుంబంయొక్క ఛాయా చిత్రములో భార్యా సమేతముగా కోడుకులు, కోడండ్లు,కూతుర్లు, అల్లుండ్లు, మనుమలు, మనుమరాండ్లతో పరిపుష్టగాయున్నది. ప్రస్తుతం కోడుకులు,కోడండ్లు, కూతుర్లు, అల్లుండ్లు అందరూ ఉద్యోగాలు చేస్తున్నారు.

Expression of gene అని ఏవయస్సులో ఏ జన్యువులు పనిచేయాలో ఆవయస్సు, సమయం రాగానే అవి పనిచేయటం మొదలు పెడతాయి. 35 నుండి 40 సంవత్సరాలమధ్యలో వారి తండ్రిగారు నాటిన అచలబోధ బీజం అంతఃకరణమనే క్షేత్రమునందు మెలకెత్తింది. తల్లిదండ్రుల బీజాలు అందరి క్షేత్రాలలోనూ అవి మొలకెత్తుతుంటాయి. కొందరు వాటిని పోషించి పెంపుచేసి వృక్షలుగా తయారు చేస్తారు. కొందరు పుట్టగానేత్రుంచి వేస్తారు. తల్లిదండ్రులయొక్క ఆశయాలను గుర్తించి, పోషించలేని సంతానాన్ని వేమన్నగారు“ పుట్టలోని చెదలు పుట్టదా, గిట్టదా” అని అన్నారు.

శ్రీ ఆనందార్యులు తన తండ్రినడచిన అడుగుజాడలను వెదకడం మొదలు పెట్టాడు. శ్రీరాపెల్లి సోమలింగం, శ్రీ కర్ర చెన్నారెడ్డి, శ్రీమతి భక్తానంద తూడి దేవమాంబ, శ్రీభైరి అంబయ్య, శ్రీ చెన్నవరం రామదాసు, శ్రీ భూక్య బాలాజి సింగు మొదలగు తన సొదరులను కలుసుకున్నాడు. అప్పటికే వీరందరికి వేలసంఖ్యలో శిష్యగణం ఉండేది.

1975 శ్రీమద్భాగవత కృష్ణదేశికుల వారి శతజయంతి ఉత్సవాల సంధర్భముగా అందరూ ఒకచోట కలుసుకొనే అవకాశం వచ్చింది. శ్రీ పొన్నాలరాజయోగి వర్గంతోనూ, శ్రీ ఫీల్ఖాన లక్ష్మణప్రభు మందిరముతోను, అప్పటికే, విసిగివేసారిన ఆగయార్య శిష్యవర్గం తీవ్ర అసంతృప్తిలో ఉన్నారు. వీరిలాగే అసంతృప్తిలోయున్న మరికొందరు తోడైనారు. శ్రీ రాపెల్లి సోమలింగం శిష్యప్రశిష్యులైన శ్రీ వెలిగేటి నారాయణగారు, వారి శిష్యులు శ్రీ బోద్దుల క్రిష్ణగారు, శ్రీ బింగి రాజయ్యగారు, మరియు శ్రీగుండా చెంద్రయ్యగారు శ్రీగుర్రం శంకర్గారు, శ్రీదేవరకొండ నీలప్పగారు, శ్రీ గంజిరాములుగారు, శ్రీ కె గజానంద్గారు. శ్రీ కె.రుక్మాజిగారు హైదరాబాదులో ఉండే

మొదలగువారు మనము ఒక సంస్థను స్థాపించాలని ఆనందంగారిని గట్టిగా కోరినారు. వరంగల్‌లో ఉంటు ఉద్యోగంచేసే నేను హైదరాబాదులో ఎలా పనిచేయగలనని విచారిస్తున్న సమయంలో శ్రీ బోధానంద బద్దుల క్రిష్ణగారు ముందుకు వచ్చి మీరు మాకు అండగా ఉంటే సంస్థను స్థాపించి, శ్రీమద్భాగవత క్రిష్ణదేశిక మందిరమును నిర్మిస్తామని వాగ్దానముచేయగానే, మళ్ళీ శ్రీమద్భాగవత క్రిష్ణదేశికుల జయంతి అయిన ఈ రోజున వచ్చే సంవత్సరం కలుసుకుందామని వెళ్ళిపోయినారు.

శ్రీ బోధానంద బొద్దుల క్రిష్ణగారు మరియు శ్రీబింగి రాజయ్యగారు వారిగురువుగారైన శ్రీవెలిగేటి నారాయణగారు, భావగారైన శ్రీగుండా చంద్రయ్యగారు, శ్రీదయానంద గోనె రాజయ్యగారు మరియు శ్రీసోమలింగం గారి సహాయములతో 'శ్రీ శివరామదీక్షిత అచలగురుపీఠ రాజయోగాశ్రమము' పేరులో శ్రీ బద్దుల క్రిష్ణ అధ్యక్షుడుగా మరియు శ్రీబింగి రాజయ్య కార్యదర్శిగా రిజిష్టరు చేయించినారు. శ్రీ మార్కండేయ సొసైటీ పేరులో ఏర్పాటు చేసిన సహకార హౌసింగు సొసైటీ నుండి 2 ప్లాట్లను 'శ్రీమద్భాగవత క్రిష్ణప్రభు మందిరము' కొరకు కేటాయించినారు. రెండుమూడు సంవత్సరాలలోనే ఈ పనులన్నీ పూర్తి చేసినారు.

1980 సేవా సమాఖ్య కార్యక్రమాలు ప్రారంభమైనాయి. తెలంగాణ ప్రాంతములో ఆశ్రమాలు అనుబంధపీఠాలుఉన్నయి. ఆంధ్ర ప్రాంతములో వ్యాపింపజేయాలనే ఉద్దేశ్యముతో శ్రీ నేమాని వెంకటరామంగారి సహకారముతో శ్రీమతి ఆచళ్ల మాణిక్యాంబగారి వానపల్లి, ఆశ్రమము,తాటిపత్రి శివరామదీక్షితుల ఆశ్రమము, శ్రీ నిల్లా కృష్ణమూర్తిగారి లొద్దిపూడిమొదలగు ఆశ్రమాలతోపాటు బద్దుచినవెంకటాయపాలెం శ్రీధర నిర్మలానంద అశ్రమాన్ని ప్రకటించి శ్రీ నిర్మాలానంద కోపనాతి గంగరాజుగారిని 'సేవా సమాఖ్య పితామహు'నిగా ప్రకటించినారు. నిజామాబాదులో 1983లో ద్వితీయ మహాసభలు, అనాధ ఆశ్రమ నిర్మాణము జాతరను తలపించేలా చేయుటలో శ్రీ ఆనందంగారిదే ముఖ్యభూమిక. సేవా సమాఖ్య కార్యక్రమాలు ఉధృతంగా జరుగుచున్న సమయంలో శ్రీ బోదానంద బొద్దుల క్రిష్ణగారు,కార్వాన్ జులైలో జరిగిన మతకల్లోలములో మరణించారు. ఇది సేవాసమాఖ్యకు మొదటి దెబ్బ పడినది. అప్పటి వరకు సలహాదారులుగ ఉన్న శ్రీ ఆనందంగారు 1984 ఆగష్టునుండి సేవా సమఖ్య అధ్యక్షభాద్యతలు చేపట్టినారు. 6-5-1998 వరకు అధ్యక్షస్థాములో కొనసాగి 7-5-1988న శ్రీ నేమాని వెంకటరామంగారిని అధ్యక్షులుగా చేసి, వారు మళ్ళీ సలహాదారులగా కొనసాగినారు. వీరు ప్రసిడెంటుగా ఉన్న కాలములో ఉద్యోగానికి ఇబ్బందులు లేకుండా ఉండాలని ఆదివారాలలో పూజలు నిర్వహించడం మొదలు పెట్టారు. వరంగల్ నుండి కాకినాడ వెళ్ళాలంటే రాత్రి గౌతమి ఎక్సుప్రెస్‌లో బయలుదేరి ఉమయం కాకినాడలో దిగి సాయంత్రం వరకు కార్యక్రమములో పాల్గని తిరిగి రాత్రి గౌతమిలో తెల్లవారకముందే వరంగల్‌లో ఉ

ండేవారు. శ్రీఆనందంగారు, శ్రీనేమాని వెంకటరామంగారు, శ్రీబింగిరాజయ్యగారు, శ్రీనిల్లాకృష్ణమూర్తిగారు, శ్రీతంగళ్ళపల్లి రాజేందర్‌గారు ముఖ్యంగా వీరందరూ ఉద్యోగులే. నిస్వార్థంగా పనిచేస్తూ ఎవ్వరికి, దేనికి ఆశించని వీరి తత్వం సేవా సమాఖ్యను శిఖరాలకు చేర్చింది.

సేవాసమాఖ్యను నిందిస్తూ కరపత్రం తీసినవారిపై సివిల్ కేసు వేసి క్షమాపణ చెప్పించినారు.

లోహిత గ్రామములో వాడపల్లి ఆశ్రమము పేరుతో ఆశ్రమము ఉండేది.

14-5-2001 జరిగిన కాకినాడ మహాసభలో వారు సాంప్రదాయానికి చేసిన సేవకుగాను సేవాసమాఖ్య కార్యవర్గము 'అచలప్రబోధ రత్న' బిరుదునిచ్చి ఘనంగా సన్మానించినది.

సేవాసమాఖ్యకు అచలబోధవాచస్పతి శ్రీశ్రీశ్రీ వివేకానంద బండారు సుబ్బారాయుడుగారు,శ్రీ దయానంద నాగుల వెంకటేశంగారు,శ్రీనిత్యనిర్భయానందస్వామిగారు, శ్రీభూమానంద గుత్తికొండ దామోదర్ రెడ్డిగారి మొదలగు మహనీయులను సేవా సమాఖ్య అందించిన మహానుభావుడు.

శ్రీ ఆనందంగారికి అనేకమందితో స్నేహం ఉన్నా, శ్రీ సదానంద మాదాసు రామస్వామిగారు, శ్రీబోధానంద గూడూరు చెన్నస్వామిగారు, శ్రీ అచలానంద కూన లచ్చన్నగారు, శ్రీ సదానంద దాసరి చంద్రమౌళిగారు, శ్రీ నిత్యానంద బింగి రాజయ్యగారు, శ్రీ శ్రద్ధానంద బండినాగయ్యగారు, శ్రీ నిర్మలానంద నిల్లా కృష్ణమూర్తిగారు, శ్రీపూర్ణానందాతీత చింతిరెడ్డి ప్రతాపరెడ్డిగారు, శ్రీ పరమానంద సామవెంకన్నగారు, శ్రీ ప్రేమానంద జప్పారాములుగారు, శ్రీ శ్రద్ధానంద అడిగొప్పుల మల్లేశంగారు, శ్రీ భూరనర్సయ్యగారు శ్రీశ్రద్ధానంద చేర్యాల బలరాంగారు మొదలగు వారితో అత్యంత సన్నిహితంగా మెలిగారు. ఇక శ్రీమతి పట్టెం లింగమ్మగారిని ఆడబిడ్డయని ప్రతి పెండ్లిలో బట్టలు పెట్టేవారు.

ఎన్ని అవాంతరాలు ఎదురైనా రామంచ, పోతుగల్లు, సిద్దిపేట, పెద్దలింగాపురం, పోతంశెట్టిపల్లె, అబులాపురం, పెంచికలపేట, షోలాపురం, తాండూరు, నర్సాపురం, చిన్నముప్పారం మొదలగు అనుబంధపీఠాల పూజలకు తప్పకుండా హాజరయ్యేవారు.

ఈ బోధను నాన్నగారు ఉన్నప్పుడు శ్రద్ధచెయ్యలేదు. కాని ఆయన తరువాత అదే నాకు జ్ఞానాన్ని, ధనాన్ని, ధైర్యాన్ని, ఆనందాన్ని ఇచ్చింది. ఆదుంకు ఫలితంగా ఈ శరీరం పడిపోయేవరకు సేవచేస్తానని, భీష్ముని వలె ఉత్తరాయణం రాగానే 16-1-2013 మధ్యాహ్నం తనువు చాలించినారు.



**సహజానంద గంగుల రవీందర్‌రెడ్డి, ఉపాధ్యాయులు**

సేవాసమాఖ్య కేంద్ర సహాయకార్యదర్శి, జక్లపల్లి.

# వారు కరుణామృతులు

ఆర్యులారా! అందరికి ద్వాదశనమస్కారములు

మనది శివరామదీక్షిత సిద్ధాంత సాంప్రదాయము. నేడు ఈపీఠం అనేకశాఖోపశాఖలుగా వర్ధిల్లుచున్నది. ఈ సిద్ధాంతవ్యాప్తి సేవలందించిన వారిలో అనేకమంది అచలగురువులున్నారు. వీరిలో శ్రీపూర్ణానంద వాడపల్లి ఆగయార్యరాజయోగి ఒకరు. వీరు శ్రీవెంకటేశ్వరశతకమను అమూల్యశతక రచనచేసి ఎంతోమంది ముముక్షువులకు భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వ, పరిపూర్ణభావాన్ని అందించి బహు ప్రయోజనాన్ని చేకూర్చినారు. అట్టి మహాపురుషుని కుమారుడు మరియు ప్రియశిష్యులైన శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందరాజయోగిగారు.

వీరిమండలారాధనా పూజామహోత్సవ సందర్భమున, వారు మాపై చూపిన వాత్సల్యమును మీతో మనవి చేయుచున్నాను.

తన దంద్రిగారిదగ్గర చాలామంది గురుభక్తులు బోధలు వినేవారు. వారి సహాయసహాకారాలతో పెంపువహించిన ఈ దేహం కణకణములో వ్యాపించియున్నది. వారి ఋణం తీర్చలేనిది అని అభిప్రాయమువ్యక్తంచేసినారు.

శ్రీమదచలగురుపీఠరాజయోగాశ్రమసేవాసమాఖ్య అంటేనే వాడపల్లి ఆనందంగారని ముద్రపడింది. వీరు తరుచుగా సమాఖ్యఅంటే నాతో అంతమయ్యేది కాదు. యావన్మంది సాంద్రాయ పెద్దలదని చెప్పేవారు. ఎన్నో ఆశ్రమాలను అనుబంధపీఠములుగా ఏర్పాటుచేయుటకు కీలకపాత్ర పోషించినారు. వీరులేని ఈనాడు సమాఖ్యకు తీరనిలోటు. ఇంకెవరితోనూ ఈలోటు సరిచేయలేము.

ముఖ్యముగా యువకులను ఎంతోప్రోత్సహించేవారు. సాంప్రదాయం అభివృద్ధి జరగాలంటే మీలాంటియువకులు ముందుకువచ్చి బోధనా తరగతులకు హాజరై ప్రచారకులుగా ఎదగాలని కోరేవారు. ఈ సిద్ధాంతాన్ని దేవాదాయ ధర్మాదాయశాఖవారు, పత్రికలు, మీడియావారు, గుర్తించేటట్లు, మూఢాచారాలను, దురాచారాలను, లింగవివక్షత మొదలగువాటిని సహేతుకముగా ఖండిస్తూ, అభ్యుదయ భావాలను జోడించి చెప్పేవారు. దేవుళ్ళు, దయ్యాలు, మంత్రాలు, తంత్రాలపేర్లతో చేసే, ఆధ్మాత్మికత పేరుతో ప్రజలను మోసంచేసే బాబాలను అరికట్టాలంటే

పారమార్థిక విద్యద్వారానే అని నొక్కి చెప్పేవారు. అందుకోసం అందరూ చదుకోవాలి. ముఖ్యంగా స్త్రీలను పురుషులతో సమానంగా చదివించాలని, తల్లే ప్రథమ గురువు కాబట్టి ఈ విద్య అక్కడనుండే ప్రారంభించాలని ప్రతి సభలోనూ చెప్పేవారు.

మతములూఅచలబోధ, కర్మసిద్ధాంతముల గురించి వినాలంటే కనులకు కట్టినట్టు చెప్పేవారు. బోధాధికారులను తయారు చేయాలనే ధృడసంకల్పం కలిగియుండేవారు. ఈ విధంగా సాంప్రదాయానికి ఎనలేని సేవజేసి కలలో తోచిన శరీరాలు ఎలాగో అలాగేనని కాలమార్పులో కనుమరుగైనారు. నేడు ఇటువంటివారు అతి దుర్లభము. వారు చూపిన కరుణామృతదయకు అనంతానంత కృతజ్ఞతలు.

# వందన సమర్పణ సుమమాల

## శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యుల మండల అభిషేకము

## 25-2-2013

శ్రీ శివరామదీక్షిత సిద్ధాంతము చాలా సులభమార్గము ఒకటి, లేనెరుక మరొకటి ఉన్న పరిపూర్ణము ఈ రెండే రెండు విధములా తెలియజేయు బోధ శ్రీ శివరామ దీక్షితుల బోధ. ఈ బోధను భాగవత క్రిష్ణదేశిక ప్రభువుల వారు చాల చక్కగా తెలియజేసినారు.

కందార్ధ: పరిపూర్ణ మెరుక లెట్టివో గురుముకమున లెస్సరెంట్ని గుర్తిరిగేరుకన్ సరిపుచ్చుకున్న మృషయని పరిశుద్ధ ప్రబోధ ఇది పాటించగనరా శివరాముల పద్ధతి ఇదేరా నరులు కొందరు పల్కి ఎరుకాను మ్రింగి పరిపూర్ణమయ్యె మంచెరుగాక చెడుటాకై పాటించిగనరా శివరాముల పద్ధతి ఇదేరా.

ఓ జనులారా, పరిపూర్ణ పరబయలు ఎటువంటిది ఎరుక యెటువంటిది యని సద్గురుమూర్తి వలనా వస్తు నిశ్చయముగా ఉన్నవి ఉన్నట్లుగా తెలుసుకొని రెంటినీ సమము చేసి చూడగా ఎరుక అసత్యమగును. గనుకా ఇది పరిశుద్ధమైన అచల బోధయని చెప్పబడును. శివరామదీక్షితుల మార్గము కనుకా విచారించి తెలుసుకొనుము. కొందరు మానవులు ఈ అచలబోధ పద్ధతి తెలియక ఎరుకను పరిపూర్ణ పరబాహ్యము నందు ఐక్యము చేసి పూర్ణత్వం పొందియున్నామని పల్కుచుందురు. అది జన్మ హేతువే చెడుమార్గము కాని జన్మరాహిత్యము కాదు. ఎందుకనగా పరిపూర్ణ మెరుకాల యెరిగి ఎరుకనుమాను అని అన్నారు మన పెద్దలు. ఓ జనులారా ఎరుకనగానేనని, నీవని, జగమని భావింపుము ఈ ఎరుకను ఎల్లవేళలా (సదా) విడిచిపెట్టుము. ఇది ఎండమావుల వలె ఇదిలేనిది. అందుకే ఇదిలేనెరుకా ఇది లేనిదని ఈ ఎరుకను వదులుమని నిర్ణయము.

శ్రీ శివరామదీక్షితుల భావాన్ని శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు చక్కగా తెలియజేసేవారు. భాగవత కృష్ణదేశిక ప్రభువుల కందార్థములు లేకుండ మాట్లాడేవారుకాదు. భాగవతుల క్రిష్ణదేశిక ప్రభువులు (భా) అనగా భక్తి (గ) అనగా జ్ఞానము - (వ) అనగా వైరాగ్యము (త) అనగా తత్వము మొత్తం కలిపి భక్తి జ్ఞాన వైరాగ్య తత్వములు గలవారు అని అర్ధము. అదే విధముగా శ్రీ నిత్యానంద వాడపల్లి ఆనందార్యులు కొరకు విచారించితే (నిత్యా) అనగా నిత్యము. అనిత్యము అని ఉన్నవి కదా అనిత్యమనిన లేనిదని, నిత్యమనిన ఎల్లప్పుడు ఉన్నదని భావము. వాడపల్లి అనగా యెవాడ చూసినా నీ బోధనే నీ శిష్యులే ఉన్నారు. కదా 27-1-2013 రోజున నేను బీవండికి వెళ్లినాను. ఆవాడలో కూడా నీ బోధనే ఉన్నది. ఆనందము అనగా బ్రహ్మానంద పరమసుఖదం కేవలం జ్ఞాన మూర్తిం- అటువంటి జ్ఞానము బోధించే ఆనందం - నిశ్చలానందం -నిర్గుణానందం-నిత్యానందం ఆనందాలన్నీ నీవే కదా.

శ్రీ శివరామదీక్షిత సిద్ధాంతమును భక్తి జ్ఞాన వైరాగ్య తత్వములు కలిగిన భాగవత క్రిష్ణదేశిక ప్రభువుల వారి కందార్థ దరువుల ద్వారా నిత్యం వాడవాడలా ఆనందాన్ని అందించే శ్రీ నిత్యానంద వాడపల్లి ఆరందార్యులకు ఇవే మా జోహార్లు (సుమాంజలి).

**శ్రీ విజయానంద వీరంత బ్రహ్మాచార్యులు**
హైద్రాబాద్.

# శ్రీ గురుభ్యో నమః

సేవా సమాఖ్యకు శ్రీ నిత్యానంద స్వామి వారు ఎనలేని కృషి సల్పిరి. కాని ఈ ఐదు, ఆరు సంవత్సరాలలో వారి తోటి నాకు సభలలో చాలా మంచిగా పరిచయము వారి భోదనలు మాకు హృదయములకు హత్తుకునేటట్లు బోధించేవారు. కానీ వారే సేవా సమాఖ్య వారు లేని సేవా సమాఖ్య లేదు. అనేటట్టు మంచి పేరు సేవా సమాఖ్యకు తెచ్చిన ఘనత ఆనందార్యుల వారికి చాలా సార్లు బొడ్డు చిన్న వెంకటాయ పాలెం రావడం మా సభలలో పాల్గొనుట మా ప్రాంతం అంతా కలియ దిరిగిన మహా మనిషి ఆనందార్యుల వారు వారులేని లోటు చాలా బాధ కలిగించింది. ఏమి వ్రాయాలో తెలియక మా మనస్సు బాధతో వ్రాస్తున్నాను.

**సంఘోద్ధారక**
**శ్రీ నిర్మలానందబొడ్డు సత్యనారాయణ**
కాకినాడ

శ్రీ గురుభ్యో నమః

# అచల గురువులకు అంజలి

## శ్రీ పాఠక మహాశయులకు ద్వాదశి నమస్కారములు

శ్రీ శివరామదీక్షితుల వారు రెండు మంత్రములను ప్రసాదించిన మహానుభావులు వారి భోదలను అర్ధము చేసుకొని జీవితము సద్వినియోగం చేసుకున్న శ్రీ వాడపల్లి ఆనందార్యుల వారు కూడా అంతటి వారే ఈ ఉత్త బట్టబయలు ఏమి లేదు. ఈ మూలములేని గుర్తెరిగె శరీరము ఏమి లేదు. ఈ మంత్రము చక్కగా విచారించాలి. అనుభవజ్ఞులైన గురువులే అందుకు ఆర్యులు అనుభవం అంటే తిండి కాదు దేశాల మీద తిరుగుడు కాదు విచారణ చక్కగా చేయాలి. మొదలు వంకర అయితే చివరికెల్లా వంకరే అవుతుంది. సంప్రాదాయాన్ని చక్కగా అర్ధం చేసుకున్న ఆనందార్యులు అన్ని భ్రాంతులను వదిలి పూర్ణ స్థితులై జీవించినారు. భ్రాంతులు వదలడం అంత సులభమైన విషయం కాదు. గురువే దైవం అని చెప్పి సర్వ దేవతలను ఉపాసించే వార్రు కోకొల్లలు సాధనలు లేని నిరపేక్ష సత్యమును దర్శించుటకు ఏ సాధన అవసరం లేదంటే నిత్యం జపతపాలతో కాలం గడిపే వారే ఎక్కువ పైగా మేమే నిజమైన ఆచరణ గలవారమని విర్రవీగు వారందరు ఆనందార్యులను చూచి నేర్చుకోవాలి.

నూరు యజ్ఞములు చేసి దీక్షితుల వారు ఆ యజ్ఞములో నీళ్ళు పోస్తే అచల గురువులమని చెప్పుకునే వారే వాటిని మళ్ళీ రాజేస్తున్నారు.

మన వారు సాంఖ్యము నేర్పించవచ్చు గాని సాంఖమే పెద్దది గాదు, తారకము బోధించవచ్చు గాని తారకమే పెద్దది గాదు. అమనస్కము నేర్పించవచ్చు గాని అమనస్కమే పెద్దది గాదు, మహావాక్య బోధ బ్రహ్మ విద్య అంటారు. దానిని నేర్పించవచ్చు గానీ, బ్రహ్మమే సత్యము గాదు, అంతేగాక వార్తికము నేర్పించవచ్చు అదియును సత్యము గాదు, ఇట్టి విద్యలన్నీ ఒక్క వ్యక్తితోనే పోవును గాని పరిపూర్ణ బోధ ఒక వ్యక్తితో పోనిది రానిది, గనుక ముక్కులు మూతులు మూయనేల ముఖ్యమైనది ఏ బాధలు లేనిది అచల బోధ బాధలేకుండ తెలిసి ఉన్నది ఉన్నట్లు లేనిది ఏదో అది జూపి లేకుండా చేసిన వారే నిజగురువులు. ఆ కోవలో ముందుండే వారు ఆనందార్యులు. శ్రీ మదచల గురు పీఠ రాజయోగాశ్రమ సేవా సమాఖ్య ఏర్పరచి సంప్రదాయమును ఒకే గొడుగు కిందికి తేవాలని తపించిన తపస్వీ ఆనందార్యుల ఆశయాలను కొనసాగిద్దాం.

**శ్రీ బోదానంద సుదర్శన్ గౌడ్**

నర్సప్పగూడ